




# అంకురం

కవితాసంకలనం...

తెలంగాణ మోడల్ స్కూల్,

వల్లాల, శాలిగౌరారం, నల్లగొండ జిల్లా.

# ధాతలు :


శ్రీ మహ్మద్ ఇంతియాజ్ & జెబున్నీసా బేగం గారు
(గ్రామ సర్పంచ్, వల్లాల)


శ్రీ మురారి శెట్టి కృష్ణమూర్తి & ఉమారాణి గారు
(వ్యాపారవేత్త)


శ్రీ బుడిగె శ్రీనివాస్ & నాగమణి గారు
(విద్యావేత్త)


శ్రీ కుంచెం రమణమ్మ & సోమయ్య గారు
(గ్రామ సర్పంచ్,నోముల)


శ్రీ సుంకరి సైదులు & పుష్పమ్మ గారు
(గ్రామ పెద్దలు,బొప్పారం)

# అంకురం

(కవితా సంకలనం)

సంపాదకులు:

శీలం భద్రయ్య

పిజిటి తెలుగు

తెలంగాణ మోడల్ స్కూల్ & జూనియర్ కాలేజ్

వల్లాల, శాలిగౌరారం, నల్గొండ జిల్లా

**అంకురం** (కవితా సంకలనం)

**సంపాదకులు : శ్రీ శీలం భద్రయ్య**

**సహ సంపాదకులు : శ్రీ గోగుల శ్రీనివాస్,**
**తెలుగు భాషోపాధ్యాయులు**

**కోఆర్డినేటర్ : శ్రీ తండు ఆంజనేయులు,**
**తెలుగు భాషోపాధ్యాయులు**

మొదటి ముద్రణ: సెప్టెంబర్, 2019

**వెల:** రూ. 60

**ప్రతులకు :**
శ్రీ శీలంభద్రయ్య, పిజిటి తెలుగు,
తెలంగాణ మోడల్ స్కూల్ & జూనియర్ కాలేజ్
వల్లాల, శాలిగౌరారం, నల్గొండ జిల్లా.
9885838288, 8919690756

**ప్రచురణ:**
తెలంగాణ మోడల్ స్కూల్ & జూనియర్ కాలేజ్
వల్లాల, శాలిగౌరారం, నల్గొండ జిల్లా.

**ముద్రణ:**
లేపాక్షి ప్రింటర్స్, హైదరాబాద్.

# అంకురం

బాల్యంలో భవిష్యత్తు అంతా "అంకురం" రూపంలో ఉంటుంది. అది సూక్ష్మంగా ఉన్నప్పటికీ స్పష్టంగానే ఉంటుంది. దానిని చురుకైన వాళ్ళు మాత్రమే గుర్తించ గలుగుతారు. పురోగతికి సంసిద్ధతను తయారుచేస్తారు. తెలంగాణ మోడల్ స్కూల్, వల్లాల, శాలిగౌరారం, నల్గొండ జిల్లా విద్యార్థులలో అంతర్లీనంగా దాగి ఉన్న సృజనాశక్తిని గుర్తించిన భాషోపాధ్యాయులు శీలం భద్రయ్య, గోగుల శ్రీనివాస్, తండు ఆంజనేయులు విద్యార్థులతో తొలి అడుగు వేయించి పాఠశాల విద్యార్థులతో కవిత్వం రాయించి ప్రచురిస్తున్నారు.

ఈ అంకురం కవితా సంకలనంలో ప్రతి కవిత ఆసక్తిదాయకం. వందకు పైగా కవితలతో ఈ పుస్తకం తీసుకురావడం పాఠశాలస్థాయి పిల్లలకు పెద్ద ప్రయత్నమే. అందుకు పాఠశాల తెలుగు భాష ఉపాధ్యాయులు మరియు ప్రిన్సిపాల్ శ్రీమతి రాగిణిగారు అభినందనీయులు. 11,12 వ తరగతుల విద్యార్థులకు భావ విస్తారం చాలా ఉంటుంది. భాషా పరిమితత్వాన్ని అది ఛేధిస్తుంది కూడా. అందువల్ల పెద్ద నిడివిగల కవితలు రాయగలుగుతారు. కానీ ఎందుకనో 8, 9వ తరగతి పిల్లల్లాగే నాలుగు నుండి ఐదు పాదాల కవితలకే పరిమితం అయ్యారు. బహుశా వారు మినీ కవిత్వం ఇష్టపడడం వల్ల కావొచ్చు.

ఇది ఆరంభ బిందువుగా చేసుకొని సృజనాధ్యయనంతో బాటు సరిక్రొత్త రచనలు లక్ష్యంగా చిన్నారులు పయనిస్తారని ఆశీర్వదిస్తూ, ఈ "అంకురం" కవితా సంకలనం ద్వారా ప్రయాణం కొనసాగించడానికి ఉపాధ్యాయులు ప్రయత్నిస్తారని, తగు చొరవ తీసుకుంటారని నమ్ముతూ...

అభినందనలతో

**డా.ఏనుగు నరసింహారెడ్డి**

కార్యదర్శి, తెలంగాణ సాహిత్య అకాడమి

8978869183

హైదారాబాదు

28.08.2019

# శుభాశీస్సులు

ఆదర్శ పాఠశాల వల్లాల ఆధ్వర్యంలో వస్తున్న "అంకురం" బాలల కవితా సంకలం చాలా మంచి ప్రయత్నం. భావ ప్రసరణకు, భావ వ్యక్తీకరణకు భాషయే ప్రధాన మాధ్యమం. చిన్నారుల్లో బాల్యం నుండే భాష పట్ల మమకారం పెరగాలన్నా, భాష పైన పట్టు సాధించి దానిని సమర్థవంతంగా వినియోగించాలన్నా ఇలాంటి సృజనాత్మక కార్యక్రమాల వల్లనే సాధ్యం అవుతుంది. పాఠశాలలోని పిల్లలు తాము స్వయంగా రచించిన కవితలతో ఒక కవితా సంకలనాన్ని తీసుకురావడం వారిలోని సృజనకు మెరుగులు దిద్ది వారు భాషలో మరిన్ని ప్రయోగాలు చేయడానికి, భాష పైన పట్టు సాధించడానికి ఎంతో దోహదపడుతుంది. చిన్నగా మొదలైన ఈ "అంకురం" వటవృక్షంలా మారి మరింతగా విస్తరించాలని, ఈ ప్రయత్నం మరెందరికో ప్రేరణగా నిలిచి మరెన్నో పాఠశాలలు ఈ బాటలో నడవాలని మనసారా కోరుకుంటూ, బాల కవులకు, మరియు వారిని ప్రోత్సహిస్తున్న ఉపాధ్యాయులు శీలం భద్రయ్య, గోగుల శ్రీనివాస్, తండు ఆంజనేయులుకు అభినందనలు తెలియజేస్తున్నాను.

**సి. హెచ్. రమణ కుమార్**

డైరెక్టర్,

ఎస్. ఐ. ఈ. టి & పబ్లిక్ లైబ్రరీస్

# అంకురం పల్లవించాలి

వల్లాల ఆదర్శ పాఠశాల లోని 111 మంది విద్యార్థులచే రాయబడిన మినీకవితల సంకలనమే ఈ అంకురం. విద్యార్థులలో సృజనాత్మకశక్తిని పెంపొందించడంలో భాగంగా వారిచే ఈ కవితలు నిర్వహించడం జరిగింది. విద్యా బోధనతో పాటు విద్యార్థులచే ఇలాంటి కవితలు రాయించి వారికి సాహిత్యం పట్ల ఆసక్తిని కలిగించాలి అన్న ఆలోచన ఈ పాఠశాల ఉపాధ్యాయులలో అంకురించడం గొప్ప విషయం.

111 మంది విద్యార్థులు రాసిన ప్రతి కవితలో చక్కని సందేశం ఉంది. అమ్మ , నాన్న, గురువు, చెట్టు, పర్యావరణం ,చదువు వంటి అనేక అంశాలను ఈ కవితలలో ప్రస్తావించారు. కొన్ని కవితలను పరిశీలించినపుడు విద్యార్థులు తమ స్థాయికి మించి రాసినట్లుగా ఉన్నవి. మచ్చుకు కొన్ని .....పల్లెకు నగరానికి ఉన్న తేడాను తెలియజేస్తూ ఉదయ్ కృష్ణ చెప్పిన విధానం బాగుంది. “పల్లెలో ప్రశాంతం, నగరం ప్రమాదం, పల్లెల నవ్వు మల్లెపువ్వు, నగరం నవ్వు ఎండిన పువ్వు” అంటూ చక్కగా చిత్రీకరించాడు.

అదేవిధంగా “భయమనే వరదకు ఆనకట్ట ధైర్యం” అంటూ భవిష్యత్తుకు భరోసా నాన్న అంటుంది బి అక్షయ. దేవుడిలా అమ్మ రాతి బొమ్మ కాదు అంటూ శ్రీవాణి చెప్పిన కవితా పంక్తులు సందేశాత్మకమైనవిగా చక్కని సూక్తుల్లా ఉన్నాయి. ఇలాంటి కవితలు రాసిన చిన్నారులు అందరికీ నా ఆశీ:పూర్వక అభినందనలు.

అంకురం చిన్నదే అయినా అది పెరిగి మహావృక్షంగా మారి ఎందరికో ఆశ్రయం ఇచ్చినట్లుగానే ఈ ఉపాధ్యాయులు చేసిన పని చిన్నగా అనిపిస్తున్నప్పటికి

అది ఎందరికో "ఆదర్శం" అయి మొత్తం విద్యార్థి లోకానికి స్ఫూర్తినిస్తుందని అనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు.

ఈ కవితా అంకురం చిగురించి శాఖలుగా విస్తరించి పుష్ప ఫల సమన్వితం అయి తెలుగు సాహితీ వనాన్ని సుసంపన్నం చేయాలని కోరుకుంటున్నాను.

ఇలాంటి ఓ మంచి పనికి శ్రీకారం చుట్టిన సోదరులు శీలం భద్రయ్య గారికి, శ్రీనివాస్ గారికి మరియు ఆంజనేయులు గారికి, వీరిని ప్రోత్సహిస్తున్న ప్రధానాచార్యులు శ్రీమతి జి.రాగిణి గారికి హృదయపూర్వక అభినందనలు.

**డాక్టర్. తండు కృష్ణ కౌండిన్య గౌడ్**
అధ్యక్షులు, తెలుగు విభాగం,
నాగార్జున ప్రభుత్వ డిగ్రీ కళాశాల, నల్గొండ.

# సందేశం

'అంకురం' కవితా పుస్తక తయారీలో పాల్గొన్న తెలంగాణ మోడల్ స్కూల్ వల్లాల, శాలిగౌరారం, నల్గొండ తెలుగు భాషోపాధ్యాయులు, విద్యార్థినీ విద్యార్థులకు ప్రత్యేక అభినందనలు. ఇంత వరకు రాష్ట్రంలోని కొన్ని మోడల్ స్కూల్స్ మాత్రమే సంచికలను వెలువరించాయి. మొదటిసారి నూరుమందికి పైగా విద్యార్థులతో పుస్తకముద్రణ చేయడం జరిగింది. ఆ కోవలోకి వల్లాల మోడల్ పాఠశాల చేరడం చాలా ఆనందంగా ఉంది. విద్యార్థులు మరియు భాష ఉపాధ్యాయుల క్రియాత్మక అంశాలను ఒకచోటకు చేర్చి ప్రశంసాత్మక ఆకృతి ఇవ్వడం సులభమైన కార్యం కాదు. ఈ పనికి నడుం బిగించిన శ్రీ శీలం భద్రయ్య, గోగుల శ్రీనివాస్, తండు ఆంజనేయులు గార్లకు నా ప్రత్యేక అభినందనలు మరియు అభివాదాలు.

**ఏ. రాంప్రసాద్ ప్రిన్సిపాల్**
టి.ఎస్.మోడల్ స్కూల్ & జూనియర్ కాలేజ్
వెలిమెల, రామచంద్రాపురం
సంగారెడ్డి జిల్లా

# నైపుణ్యం

**సరస్వతి మహాభాగే**

**విద్యా కమలాలోచనే**

**విద్యా రూపే విశాలాక్షి**

**విద్యాందేహి నమోస్తుతే !**

శిశువికాసం మొదలయ్యేది అమ్మ ఒడిలోనే. తర్వాత అతని వికాసం పాఠశాలలో అభివృద్ధి చెందుతుంది. విద్యార్థిని ప్రోత్సహించి తరగతిలోని పాఠాలనే కాకుండా విద్యార్థి సమగ్ర అభివృద్ధికి పాటుపాడేది భాషోపాధ్యాయుడు. ఆ క్రమంలోనే ఆదర్శ పాఠశాల, వల్లాల, శాలిగౌరారం తెలుగుభాష ఉపాధ్యాయ బృందం శీలం భద్రయ్య, గోగుల శ్రీనివాస్, తండు ఆంజనేయులు తమ విద్యార్థులను ప్రోత్సహించి వారిలోని నైపుణ్యాలను వెలికి తీసి ఈ పుస్తకాన్ని ముద్రించి వారిలో ఉత్సాహాన్ని పెంపొందించారు. ఈ విధంగానే తమ నైపుణ్యాలను పెంపొందించుకుని విద్యార్థులు అందరికీ ఆదర్శంగా నిలుస్తారని ఆశిస్తూ ఇందులో పాల్గొన్న విద్యార్థులకు ఆశీస్సులు మరియు తెలుగు భాష అభివృద్ధికి తోడ్పడుతున్న శ్రీమతి జి.రాగిణి గారికి శుభాభినందనలు.

**రాదారి నాగరాజు**

ప్రిన్సిపాల్ (FAC)

ఆదర్శ పాఠశాల, ఇర్కోడ్,

సిద్ధిపేట జిల్లా

# అభినందనలు

మోడల్ స్కూల్, వల్లాల, శాలిగౌరారం విద్యార్థుల మనోగతాల నుండి జాలువారిన పరిమళాల కవితా ఖండికల పుస్తకం ఈ “అంకురం”. దీనిని చదువుతున్నంతసేపు మనసు ఆహ్లాదంగా ఆనందడోలికల్లో పచార్లు చేస్తూ చెట్ల క్రింద ఊయలలూగినట్టు సాగింది నా పఠనం. కవితా సంపుటిలోని ఖండికలు 6వ తరగతి నుండి 12వ తరగతి వరకు విద్యార్థులు రాసినవి. వారి జీవన గమనంలో ఇల్లు, బడి, చెరువు, చెట్లు, ప్రకృతి, వాన, గురువు మొదలయిన పరిసరాలను మదిలో నింపుకొని రచనలు చేసినట్టుగా ఉన్నది. మానవ సంబంధాలు అయిన అమ్మా, నాన్న, గురువు, బడి పైనే అధికంగా కవితలు గమనించాను.

అలా వెళితే నందిత రాసిన “నా తెలుగు” ఖండికలో ‘తేనె కన్నా తీపి తెలుగు భాష.....’ అంటూ స్నేహ హృదయాలను కలుపుతుంది. శిరీష ‘అనుమానమొస్తే అమ్మను అడుగు, ఎడతెగని ఆలోచనల గురించి....’ అంటూ ‘సమాజ హితులై ఎడతెగని ఆలోచనలకు ఆస్తి....’ అంటూ చెలిమి కవిత ద్వారా స్నేహ హస్తాన్ని అందిస్తుంది. జి.సిరి ‘మబ్బుల నెక్కి వస్తున్న పడవలు చేయగా రారండి .....’ అంటూ వర్షాన్ని వర్ణిస్తుంది. సంధ్య వీణ కవితలో ‘తీయని తెలుగు తేనెల సోన ... అంటూ శతకోటి తరంగాల వీణ తెలంగాణా...’ అనడం సృజనాత్మకంగా ఉంది. చందన స్వేచ్ఛా యజ్ఞం కవితలో తెలుగు భాష గొప్పదనం వైపు తొలి అడుగు వేసింది. అంజలి రైతు, సైనికుడు, గురువు, అమ్మా, నాన్నలే మహనీయులు అంటుంది. శిరీష ‘కాళోజినే స్ఫూర్తి, నా ధైర్యం ... సదా స్మరిస్తాను....’ అంటుంది.

దేవుడికి మరోరూపం అమ్మ... నిస్వార్థ ప్రేమకు నిలువెత్తు రూపం అమ్మ గుర్తు అంటుంది శిరీష. ఆకాంక్ష ‘కన్నీటిని దాచుకొని భవితకు తోడ్పడే వారు నాన్న’... అంటుంది. శ్రావణి స్నేహం వజ్రం కన్నా గొప్పది ఆపదలు విడదీయరానిదంటూ విలక్షణంగా చెప్పింది. అనూష నా పల్లెలో “పచ్చని ప్రకృతి తల్లి అంటూ ప్రేమను రాగాలకు చిరునామా...’ అంటుంది. భవాని అమ్మ కవితలో ‘మానవ జన్మకు అమ్మ మరో జన్మ.....’ అంటుంది. చరిత అమ్మ కవితలో ‘నా పాలిట కల్ప తరువు...”

అంటుంది. పవిత్ర వ్యవసాయం కవితలో 'తొలకరి రైతు మోముపై విరిసే హరివిల్లు..
అంటుంది.

రేణుశ్రీ బడి కవితలో 'దేవాలయం సంప్రదాయ సంస్కృతులను నేర్పు గురుదేవుల మందిరం.. అంటుంది. అనూష మా ఊరు కవితలో 'అందాల భరణి అనుబంధాల ధరణి...అంటుంది. స్వాతి నాలోని భావాలు కవితలో 'ఆనందాల అలుగుల వెలుగులు.....' అంటుంది. మణికుమార్ మూసినది కవితలో 'మనకోసం వచ్చి మనకు త్రాగు, సాగు నీరందించడాన్ని పేర్కొన్నాడు.

'గురువు త్రిమూర్తుల రూపం వ్యక్తిత్వ వికాసపు మాణిక్యం'... అంటుంది దీక్షిత. 'రాలేను మిత్రమా, నేరాలేనని, భారీ వర్షాలలో బస్సులు లేవని, రైలు రద్దీని, విమాన వినాశాకాలు అడ్డు.... అంటూ హాస్య, ఆలోచనాత్మకంగా రాసింది నవ్య. వాణి దీపం కవితలో 'ఆకాశంలా ఆలోచించు, సమాజమే ఇల్లుగా జీవించు... అనే సంస్కారాన్ని బలంగా చాటి, తపించు దేశభక్తియే చైతన్యంగా గుండెల్లో దీపాన్ని వెలిగించు.. అంటూ జాతీయ భావాన్ని ఆదర్శ పాఠశాల అనుబంధాల జ్ఞాపకాలపై చాల ప్రేమను కనబర్చింది స్వాతి.

బ్రహ్మానందం కవితలో 'నవ్వితే అందం నవ్విస్తే అనందం నవ్వుతూ నవ్విస్తే బ్రహ్మానందం అంటుంది జ్యోతి. మసక కవితలో 'లక్ష్యం లేని జీవి కంటికి చీకటి నడిచే దారులు మసకబారుతూ గడిచే క్షణం బరువుగా చివరిదౌతుంది...' అని రిచా బాధపడుతుంది. టిక్ టాక్ వలలో యువత భవితను కోల్పోతూ వాట్సప్ చీకటి బతుకుల మైకం అంటూ శ్రీదేవి హితం చెబుతుంది. కుండ గురించి కుండ లేకపోతె బతుకు బండ... అంటూ కుండ బద్ధలు కొట్టి చెప్పింది కీర్తన. నాన్న బుడి బుడి నడకలు నేర్పి భుజాన్ని మోసిన నాన్నకు వందనాలు అర్పించింది ప్రణిత. తలరాత సంపద ఆకలి తీర్చదంటు ప్రవచనాలు ప్రపంచాన్ని మార్చవు, కష్టం ఇష్టంగా చేస్తే ప్రపంచ తలరాత మారుతుందని ఆశాభావాన్ని వ్యక్తం చేసింది యామిని.

మనోధైర్యానికి అండగా నిలిచేవాడే నాన్న అంటుంది స్రవంతి. మిన్ను అందని చందమామ కన్నా మండే సూర్యుని కన్నా కనిపించని దైవం కన్నా అమ్మ నాన్నలే మిన్న అంటాడు మధు. గమ్యంలో మనలో చైతన్యాన్ని నింపుతూ లోపాలను

సరిచేస్తూ భవిష్యత్తుకు పునాదులు వేస్తూ గమ్యాన్ని చూపేది నాన్న అంటుంది పూజిత. మహారాణిలా పేదరికాన్ని దరిచేరనియక మమకార మాధుర్యాన్ని పంచుతుంది ఉమ.

హలం కవితలో 'రైతులేని రాజ్యం, భూమిపై భోజనం పూజ్యం... అంటాడు రోహిత్. 'నీకెందుకు నా కష్టం నా చదువు, నా ఆశయం.. అని స్వేచ్ఛా గీతం విన్పిస్తుంది సుప్రియ. త్యాగం కవితలో భవిష్యత్తు భరోసా నాన్న, ఆరాటానికి అడ్రస్ నాన్న అంటూ నాన్న త్యాగధనుడు అంటుంది అక్షయ. అందంగా ఇల్లాలి వెలుగు ఇంటికి అండ, దేశానికి వెలుగు సైనికుడు... అంటుంది శ్వేతా.

కవిత్వంలేని జీవితం, అమ్మ లేని జీవితం, కష్టం లేని బ్రతుకు విలువలేనివని... వినూత్నంగా చెప్పింది ఇందు. పేగుబంధం కవితలో అమ్మ అనుబంధాల దైవిక బంధం పుట్టుకకు మూలం అంటుంది శృతి. వేపచెట్టు కవితలో చెట్టు పెద్దది, కాయ చిన్నది. నీడ పెద్దది ఎ.సి. కన్నా చల్లగా ఉంటుందని, వేపపుల్ల బ్రష్ కంటే గొప్పగా ఉంటుందని అంటూ ప్రతి ఇంట చెట్టు నాటమని అంటాడు వినయ్. దానగుణంపై భూమి నవ్వు విన్నాడు మనీష్.

ఇలా అనేక కవితలు రుచిగుళికలు. లౌక్యం తెలిసిన కవితలు పిల్లలు రాయడం వెనుక వారి భాషాభిరుచిని తెలియజేస్తుంది. తమ మనోభావాలను చిరు కైతలను పిల్లల మల్లెలను మార్చి గూర్చి పూలమాలగా చేసిన ఈ కృత్యం అనితర సాధ్యం అయినది. ఈ తొలియజ్ఞంలో తమ కాల ధనాన్ని వెచ్చించిన మిత్రులు తెలుగు భాషోపాధ్యాయులు శీలం భద్రయ్య గారికి, గోగుల శ్రీనివాస్ గారికి, తండు ఆంజనేయులు గారికి మరియు అంకురం పుస్తకాన్ని సాహిత్యలోకానికి పరిచయం చేసిన కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి రాగిణి గారికి హృదయపూర్వక ధన్యవాదాలు తెలుపుతూ నేటి బాల కవులే రేపటి యువకవులుగా మరింత చక్కని సృజనతో విద్యాబుద్ధులతో వేలుగొందుతారని శుభాభినందనలు.

**డాక్టర్ పెండ్యాల మహేశ్వర్ గౌడ్**
తెలుగు అధ్యాపకులు,
టి.ఎస్.మోడల్ స్కూల్, తుర్కపల్లి

# పరిమళం

**"అక్షరానికి పాలు తాపి పదాన్ని చేయాలి, వాక్యానికి శిక్షణనిచ్చి కవిత్వం చేయాలి, కవిత్వానికి నీ జీవితాన్నిచ్చి ఆయుధం చేయాలి"** –ప్లాబో నెరుడా.

మదిలో మొలకెత్తిన ఆలోచన తీవ్రతకు అక్షర రూపం కవిత్వం. గమనించే జీవితంలో ఎదురుపడ్డ గాయాల రూపం కవిత్వం. అటువంటి కవిత్వం తెలుగు సాహిత్య ప్రక్రియల్లో విశిష్ట స్థానాన్ని నిలుపుకుంది. ఈ రంగంలో కృషి చేసిన అనేకమంది కవులు సామాజిక చైతన్యాన్నిపంచే విధంగా తమ కవిత్వాన్ని అల్లినారు. ప్రగతిని కాంక్షించి ముందుకు కదిలారు.

అయితే, ప్రతి వ్యక్తి దాదాపు పాఠశాల, కళాశాల స్థాయిలోనే సృజనశీలురుగా మారే అవకాశం ఎక్కువగా ఉంటుంది. గురువుల ప్రోత్సాహం ప్రేరణ అందుకు తోడయితవి. ఈ క్రమంలో సాహిత్యాన్ని వంటపట్టించుకున్న వారు భవిష్యత్తు కాలంలో కవో లేదా రచయిత కాకమానరు.

మోడల్ స్కూల్, వల్లాల విద్యార్థిని విద్యార్థులు ఇప్పుడు అదే బాటలో నడుస్తున్నారని చెప్పుటకు నేడు వారు రాసిన కవితలే నిదర్శనం. కవిత్వంపై శిక్షణ ఇవ్వడమే గాక వారిని ప్రోత్సహిస్తూ నాణ్యమైన కవితలను ఇంతమంది విద్యార్థిని విద్యార్థుల కవితలను సేకరించి సంపాదుకులు పుస్తకంగా ప్రచురించడం ముదావహం. ప్రచురించిన దాదాపు అన్ని కవితలు సందేశాన్ని ఇవ్వడమే కాక చైతన్యాన్ని పెంచే విధంగా ఆత్మవిశ్వాసాన్ని పెంచే విధంగా ఉన్నవి. అమ్మా నాన్నల ప్రేమను తెలుగు భాష గొప్పతనాన్ని అన్ని స్నేహం విలువను రైతు గొప్పతనాన్ని తెలిపారు. దేశభక్తి కవితలతో పాటు, భారతదేశం తెలంగాణాల విశిష్టతలను వ్యక్తపరిచే కవితలు వర్షం, బ్ర హ్మానందం వంటి అనుభూతి కవితలు, సైనికులు, తెలంగాణ వైతాళికులు ప్రజాకవి కాళోజీ నారాయణరావు పైన రాసిన కవిత ఈ పుస్తకంలో చోటుచేసుకుంది. ఈ కవితలు పిల్లల ఊహా శక్తికి తార్కాణం.

ప్రముఖ పరిశోధకులు మండల స్వామిగారు వల్లాల గ్రామ నామ విశిష్టతను తెలుపుతూ పశ్చిమ చాళుక్యులపైన త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యుడు వేయించిన వల్లాల శాసనంలో 'ఒల్లాల' అని ఉన్నదని క్రీస్తుశకం 1097 డిసెంబర్ 24 గురువారం నాడు వేయిచ్చినప్పటి నుండి ఈ గ్రామం 'ఒల్లాల', ఆ తర్వాత 'వల్లాల'గా మారిందని సప్రామాణికంగా తన సిద్ధాంత గ్రంథంలో తెలిపినారు. కాకతీయ సామంత రాజులైన కందుకూరి చోడులు ఏలిన ప్రాంతం 'వల్లాల' అని నిర్ధారించారు.

అటువంటి 'వల్లాల' సహజంగానే చైతన్యవంతమైన నేల. కాకతీయ కళాతోరణం పోలి ఉన్న మరో కళాతోరణం ఈ ప్రాంతంలో ఉండటం ఈ నేలకు దక్కిన గౌరవం. అటువంటి చారిత్రక సాంస్కృతిక కళాసంపదను అడుగడుగున నింపుకొని ఉన్న ప్రాంతం నుండి ఆదర్శ పాఠశాల పిల్లలు కవిత్వాన్ని వినిపించడం చెప్పుకోదగిన విషయం.

మల్లెలు పంచిన పరిమళం ఈ కవిత్వం. చిన్నతనంలోనే కవిత్వ క్షేత్రంలోకి అడుగిడుతున్న విద్యార్థిని విద్యార్థులకు నా మన:పూర్వక శుభాభినందనలు. ఆశీస్సులు.. స్వాగతం.. ఈ ప్రయత్నం బాలల భావిసాహిత్య ప్రస్థానానికి తోడ్పాటునందిస్తుంది. బాలకులను తీర్చిదిద్దుతున్న సాహిత్య పిపాసి పుస్తక సంపాదకుడు కవి శీలం భద్రయ్య గారికి నాలాంటి వారినెందరినో తెలుగు వైపు మళ్లించి ఎందరో విద్యార్థుల జీవితాల్లో వెలుగులు నింపిన అక్షర ప్రేమికులు గోగుల శ్రీనివాస్ గారికి, పిల్లల ప్రేమను చూరగొంటున్న సాహిత్య అభిమాని తండు ఆంజనేయులు గారికి అభినందనలు, నమస్సులు. సాహిత్యాభిలాషి పెద్దలు ప్రధానోపాధ్యాయులు శ్రీమతి జి.రాగిణి గారికి ప్రత్యేక శుభాకాంక్షలు, అభినందనలు.

రాష్ట్రవ్యాప్తంగా 194 పైగా మోడల్ స్కూల్ లు ఉండగా ఇటువంటి ప్రయోగాన్ని తొలిసారిగా భారీఎత్తున చేసిన వల్లాల మోడల్ స్కూల్ సాహిత్య చరిత్రలో నిలిచిపోతుందని ఆశిస్తూ అభినందనలు తెలియజేస్తూ...

మీ **నర్రా ప్రవీణ్ రెడ్డి**
కవి, రచయిత, తెలుగు సాహిత్య పరిశోధకులు
ఉస్మానియా విశ్వవిద్యాలయం. – 9393636405

# పరిమళం

ఈ కవితా కుసుమాలు ఆదర్శ బాల్యోద్యాన వనంలో పూచిన పూలు. మానవుడు సంఘజీవి మన చుట్టూ ఉన్న ప్రపంచం మనల్ని ప్రభావితం చేస్తుంది. అలాగే ఈ విద్యార్థులు వివిధ సందర్భాలలో అందించగా కుసుమించిన కుసుమాలు నేటి సమాజంలో బహుతక్కువగా కనిపించేవి.

కవితా సుమాలు పరిమళభరితం. ఆస్వాదించే ఆసక్తి ఉండాలి కానీ ఈ సంపుటిలో కవితలన్నీ వికసిత సుమాలే. అన్ని పూలు చక్కని పరిమళం ఇవ్వవు. కానీ ఈ సుమాలన్ని సౌందర్యం, పరిమళం పుణికి పుచ్చుకున్నాయి.

అవగాహన సంపూర్ణంగా సాధించిన ఈ కవితలన్నీ పదిమంది నోళ్లల్లో పదికాలాలు ఉండాలని జన హృదయాలను రంగరించగలవని నా ఆకాంక్ష. ఇటువంటి ఉత్తమ పుస్తకాన్ని వెలువరించిన ఆత్మీయ మిత్రులు శీలం భద్రయ్య గారికి నా హృదయపూర్వక అభినందనలు. ఇతర తెలుగు ఉపాధ్యాయులు శ్రీనివాస్ మరియు ఆంజనేయులు గారికి నా హృదయపూర్వక అభినందనలు. ఈ కవిత్వం అందరి అభిమానాన్ని చూరగొనాలని ఆశిస్తూ ఆకాంక్షిస్తూ...

**కె. సరస్వతి**

తెలుగు ఉపన్యాసకులు

ఆదార్శ పాఠశాల, పోచంపల్లి, యాదాద్రి జి ల్లా.

అలతి అలతి పదబంధాలతో

ముగ్ధమనోహరమైన భావాలతో

కవితలకు అంకురార్పణ చేసిన

బాలకవి మిత్రులకు

ఆశీస్సులు మరియు అభినందలు

**బి.కొండయ్య,**

**పిజిటి తెలుగు**

# ఆశీరభినందనలు

తెలుగు సాహిత్యంలో బాలసాహిత్యానికి కొదవేమీ లేదు. పాల్కురికి సోమనాథుడు బసవపురాణంలో శివుని బాల్య వర్ణనను బాల సాహిత్యంగా చెప్ప వచ్చును. తర్వాత కాలంలో నాచన సోమనాథుడు, శ్రీనాథుడు తమ కావ్యాల్లో పిల్లల ఆటలు, పాటలను రచించారు. పోతన భాగవతం దశమస్కంధంలో, పంచతంత్రం కథల్లో, విచిత్ర కాశీమజిలీ కథల్లో చిన్నయసూరి నీతిచంద్రిక కథల్లో మనకి బాలసాహిత్యం కన్పిస్తుంది.

ఆధునిక యుగంలో బాల సాహిత్యం పద్య, గద్య, గేయ రూపంలో తన ప్రత్యేకతను చాటుతున్నది. గురజాడ వేంకటఅప్పారావు, గిడుగు సీతాపతి, చింతాదీక్షితులు, దాశరథి, సినారె బాల సాహిత్యాన్ని సృష్టించి దానికి జీవం పోశారు.

చందమామ, బాలమిత్ర, బాలజ్యోతి, చిన్నారి, బుజ్జాయి వంటి పత్రికలు బాలసాహిత్యానికి ప్రాణం పోశాయి. నేటి నవనాగరిక ప్రపంచంలో ఎన్నో రకాలైన బ్లాగులు, వెబ్‌సైట్లు బాలసాహిత్యాన్ని ఒక్క క్లిక్కుతో అంతర్జాలంలో అందరికి అందుబాటులోకి తీసుకువచ్చాయి. విద్యార్థినీ విద్యార్థుల్లో అంతర్లీనంగా దాగున్న సృజనాత్మక శక్తులను వెలికి తీయడానికి మాడల్ స్కూళల్లో వివిధ రకాల ప్రయత్నాలు జరుగుతున్నాయి. అందులో భాగంగా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 2014 సంవత్సరంలో మోడల్ స్కూళ్లలో ప్రప్రథమంగా "రైజింగ్ స్టార్" పేరుతో 88 పేజీలతో సంచికను తూర్పింటి.నరేశ్ కుమార్ సంపాదాకుడిగా విద్యార్థుల రచనలతో తేవడానికి ఓ ప్రయత్నం జరిగింది. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా 2017 సంవత్సరంలో తెలంగాణ మోడల్ స్కూల్ రేగోడ్, మెదక్ జిల్లా నుండి డా.వి.జయప్రకాష్ సంపాదకుడిగా 'అద్వైత" అనే పేరుతో 32 పేజీలతో సంచిక

వెలువడింది. 2019 సంవత్సరంలో రాజన్న సిరిసిల్ల జిల్లా నామాపూర్ మాడల్ స్కూల్ నుండి రావూరి బసవయ్య సంపాదకత్వంలో "తీరొక్కపూలు" పేరుతో 70 పేజీలతో బాలల సంచిక వెలువడింది.

పెద్ద కవులకే వ్యయప్రయాసలతో కూడిన అంశం కవితా సంకలనం. "అంకురం" పేరుతో ఒక పెద్ద సంకలనంను తెలంగాణ మోడల్ స్కూల్, వల్లాల, శాలిగౌరారం మండలం, నల్గొండ జిల్లా నుండి ప్రధాన సంపాదాకుడిగా శీలం భద్రాయ్య ఈ సంచికను వెలువరించడం ముదావహం. దీనికి ప్రధాన సంపాదకుడిగా వ్యవహరించిన సాహితీ మిత్రులు తెలుగు ఉపన్యాసకులు శ్రీ శీలం భద్రయ్య గారిని సాహితీ సవ్యసాచిగా పేర్కొనవచ్చు. ఎన్నోవ్యయ ప్రయాసాలకు ఓర్చి ఈ సంచికకు ఒక రూపాన్ని తీసుకు రావడం నిజంగా అభినందనీయం. ఈ సాహితీ సేద్యంలో వారికి చేదోడు వాదోడుగా నిలిచి పూర్తి సహాయ సహకారాలందించిన తెలుగు అధ్యాపక మిత్రులు సహ సంపాదకులు శ్రీ జి శ్రీనివాస్ గారికి మరియు సమన్వయకర్త శ్రీ టి.ఆంజనేయులు గార్లకు ప్రత్యేక అభినందనలు తెలుపుతూ ఇలాంటి మరెన్నో మంచి కార్యక్రమాలకు భవిష్యత్తులో వల్లాల మాడల్ స్కూల్ వేదిక కావాలని ఆశిస్తూ... ఆకాంక్షిస్తూ ...

మీ సాహితీ హితెక్కషుడు...

**తూర్పింటి. నరేశ్ కుమార్**

మోడల్ స్కూల్, ఆమడబాకుల,

తేది: 29.8.2019

కొత్తకోట, మహబూబ్ నగర్

# సృజన

ఆదర్శవడిలో చిగురించిన అంకురం కవితా సంకలనం. తన చదువంతా ఆంగ్లంలో సాగుతున్న చిన్నారులు తెలుగు భాష పట్ల తన మమకారాన్ని ప్రదర్శించడం సంతోషించాల్సిన విషయం. కవితలు రాసిన బాలల సృజన శక్తికి అభివందనాలు. మనసులోని భావాలను మాతృభాషలో మధురంగా వ్యక్తీకరించారు. పుస్తకరూపంలోకి తేవడానికి కృషి చేసిన తెలుగుభాష ఉపాధ్యాయులు శీలం భద్రయ్య గారు, గోగుల శ్రీనివాస్ గారు, తందు ఆంజనేయులు గారు మరియు ప్రధానాచార్యులు శ్రీమతి జి.రాగిణిగారికి అభినందనలు.

**వెన్నెల సత్యం**

కవి, ఉపాధ్యాయుడు,

షాద్‌నగర్, రంగారెడ్డి జిల్లా.

# కవితాంకురం

బాలబాలికల యొక్క చిన్ని చిన్ని ఆలోచనలు అక్షరాలను తొడుక్కొని, కవితలుగా మారిపోయి, సాహితీ లోకంలో చిరకాలం నిలువడానికి, అందర్నీ అలరించడానికి "అంకురం" పేరుతో అందమైన పుస్తకముగా అవతరించడం హర్షించదగ్గ పరిణామం. ఇది పిల్లల ప్రతిభకు నిదర్శనం. ఈ 'అంకురం' మహావృక్షంగా ఎదుగాలని మనస్ఫూర్తిగా కోరుకుంటూ...

ఈ దిశగా ప్రోత్సహించిన ఉత్తమోపాధ్యాయులు శీలం భద్రయ్య, గోగుల శ్రీనివాస్, తండు ఆంజనేయులుకు మరియు బాలమేధావులకు అక్షరాభినందనలు !!

**వడిచర్ల సత్యం**
కవి, మణిపూసలు ప్రక్రియ ఆవిష్కర్త
తాండూర్, వికారాబాద్ జిల్లా
7989511543

# అభినందనమాల

ఆదర్శ కవితా మొగ్గలకు వికసించి గుబాళించే ఆయువుపట్టు ఉన్నట్టు వారి అక్షరాల పొందికలో తేలింది. ఇంకా వారి కవితా శక్తి పుడమి నుంచి అంకురించి వేర్లూనుకొని అంబరం వైపు సాగి పుమొగ్గలేసే ఫలవంతమైన బీజాలకు నేలవైనట్టు ఉంది. అందుకే ఆణిముత్యాలకు అభినందన తెలియజేస్తూ ఆశీర్వచనమాల వేస్తున్న అభిమానంతో ...

మీ **నకిరేకంటి సీనయ్య**
కవి, రచయిత, ఉపన్యాసకులు
ఆదర్శ పాఠశాల, బొమ్మల రామారం.

# లక్ష్యసాధన

తెలంగాణ మోడల్ స్కూల్, వల్లాలలో చదువుతున్న విద్యార్థులంతా ఆంగ్లమాధ్యమం చదువుతున్నారు. మాతృభాష తెలుగును ఐచ్ఛికంగా చదువుతుండడం మాతృభాష అభివృద్ధికై కృషి చేస్తూ ఒక మంచి ఆశయంతో ఈ పిల్లల కవితా సంకలనం తేవడం సంతోషాన్నిచ్చింది.

పిల్లలు అంది వచ్చిన అవకాశాలను అందిపుచ్చుకుంటు, ప్రభుత్వ బడులలో ప్రతిభకు కొదవలేదు అని నిరూపించారు. ఆశతో రేపటి దేశానికి దశదిశలా భావి భారత పౌరులుగా ఎదగాలి.

విద్యార్థులు చదువుతో పాటు పరిసరాల పరిజ్ఞానం, సమాజంలో మంచి చెడులను అవగతం చేసుకోని పెద్దల మాటలను గౌరవించాలి. కృషి పట్టుదలతో ఎంతటి లక్ష్య సాధన అయిన సాధించగలిగే దృక్పథం కలిగి ఉండాలి.

మాతృభాషలో మరింత పట్టు సాధించేందుకు విద్యార్థులకు కవితలను రాసేందుకు ప్రోత్సహించి కాళోజీ పేరున ప్రత్యేక కవితా సంకలనం ఆవిష్కరిస్తున్న శీలం భద్రయ్య,గోగుల శ్రీనివాస్, తండు ఆంజనేయులు గారికి అభినందనలు. ధన్యవాదాలు.

**బుడిగె శ్రీనివాసులు–నాగమణి**
సీనియర్ రిపోర్టర్ & విద్యావేత్త
శాలిగౌరారం.

# కృతజ్ఞతలు

మా చిన్నారుల 'అంకురం' కవితా సంపుటి ద్వారా వారు సాహిత్యబాటలో సాగడం, తొలిపలుకు కూత లేత పల్లవం తిన్న కోయిల గానం మాదిరి కవిత్వం మృదుమధురంగా ఉండడంతో, మొలకెత్తే మఱ్ఱి మాను విత్తనంలోని కుతూహల శక్తిని గమనించి ఈ బృహత్తర కార్యక్రమంను శిరమున గంగమ్మను మోసే శివుని బాధ్యతవోలె నెత్తిన ఎత్తుకోవడం గొప్పగా ఉంది.

కవిత్వం ఒక అనంతసాగర అంతర్మథనం. మనిషి మూలలలోకి చొచ్చుకుపోయి చేసే ప్రయత్నం. భాషా ప్రయోగ కౌశలం కవిత్వ రచనకు అవసరం. అది మా పిల్లల్లో నేడు మొలకలాగ ఎగిసింది. మొగ్గలాగ పూసింది. భవిష్యత్తులో ఇది వటవృక్షంలాగా ఎదిగి, వికసించిన కుసుమ సుగంధ పరిమళం నవసమాజంలో వెదజల్లాలని ఆశీర్వదిస్తూ అభినందిస్తున్నాము.

దాదాపుగా 20 రోజులకుపైగా పాఠశాలలో ఉన్న 200 మందికి పైగా రచనాభిరుచి గల పిల్లలను ఎంపిక చేసి మూడు రోజులపాటు కవితా రచనలో శిక్షణ ఇచ్చి మేలైనవాటిని ఎంపికజేసి పుస్తక రూపంలోకి తీసుకురావడంలో అపర భగీరథ ప్రయత్నం గావించడం మాకు మరిచిపోలేని అనుభవం, అనుభూతి. ప్రభుత్వ పాఠశాలల్లో ప్రతిభకు కొరతలేదు అని ఈ పుస్తకం మరోసారి నిరూపించింది. ఈ యజ్ఞంలో నాకు సహకరించిన మా తెలుగు ఉపాధ్యాయ సోదరులు శ్రీ గోగుల శ్రీనివాస్, శ్రీ తండు ఆంజనేయులు గార్లకు శుభాభినందనలు.

చెట్టుపేరుతోనే కాయలకు విలువ. సహృదయులు డా.ఏనుగు నరసింహారెడ్డి, తెలంగాణ సాహిత్య అకాడమి కార్యదార్శిగారు కోరినవెంటనే ముందుమాట రాయడం,

పుస్తకంపేరును పేరును సూచించడం మా అదృష్టం. పలు ప్రభుత్వ కార్యక్రమాలలో తీరిక లేకుండా నిమగ్నం అయి ఉన్నప్పటికీ అడిగిన వెంటనే తీరిక చేసుకుని మా పిల్లలకు ఆశీస్సులు, అభినందనలు అందజేయడం వారి ఔన్నత్యం, సాహిత్యాభిలాష, హృదయ వైశాల్యానికి తార్కాణం.

హనుమంతుని ఆశయం, విజయానికి వారధిగా నిలబడినది విశ్వాసం. మా తెలుగుశాఖకు అడుగడుగునా సహకరించిన మా ప్రిన్సిపాల్ శ్రీమతి జి.రాగిణి గారికి మనస్ఫూర్తిగా ధన్యవాదాలు.

మా చిన్నారి కవులకు అభినందనలు అందజేసిన మోడల్ స్కూల్ అదనపు సంచాలకులు శ్రీ సత్యనారాయణ రెడ్డిగారు, అదనపు సంచాలకులు శ్రీ రమణకుమార్ గారు, ఉప సంచాలకులు శ్రీ లింగయ్య గారు, నల్గొండ జిల్లా విద్యాధికారిణి శ్రీమతి పాలడుగు సరోజినీదేవిగారు, సిద్ధిపేట జిల్లా విద్యాధికారి డా.కాసర్ల. రవికాంత్ రావు గారు, మండల విద్యాధికారి శ్రీ జి.నాగయ్యగారు, రాష్ట్రంలోని 194 మోడల్ స్కూల్స్ ప్రధానాచార్యులు మరియు తెలుగు అధ్యాపకులకు ధన్యవాదాలు.

పుస్తక ఆవిష్కరణలో మా ఆహ్వానం మన్నించి విశిష్ట అతిథిగా విచ్చేసిన పద్మశ్రీ శ్రీ చింతకింది మల్లేశం గారు, ప్రధాన వక్త సభా సామ్రాట్ బుర్రకథ గానప్రవీణ శ్రీ జల్దా జయరాములు గారికి, ఆత్మీయ అతిథులు డా.పెండ్యాల మహేశ్వర్, డా. నేదునూరి రవీందర్ రెడ్డి, డా.వి.జయప్రకాష్, శ్రీమతి కె.సరస్వతి, శ్రీ టి. నరేష్ కుమార్ , శ్రీ ఎస్.బ్ర హ్మం, శ్రీ.యన్.శీనయ్య, యువకవి, పరిశోధకులు, శ్రీ నర్రా ప్రవీణ్ రెడ్డి,ఉస్మానియాయూనివర్సిటీ గారికి ధన్యవాదాలు.

కొండంత ప్రోత్సాహం అందించి మా పుస్తక ప్రచురణకు అండగా నిలిచి సహకరించిన దాతల వదాన్యతా గుణం సాగరమంత విశాలం. వారి సామాజిక బాధ్యత సదా అభినందనీయం. పూజ్యనీయం. పుస్తక ప్రచురణ ఎంతో వ్యయప్రయాసలతో కూడినప్పటికి తమవంతు ఆర్థిక సహకారం అందించి ముందుకు

వచ్చిన మా దాతలు శ్రీ మురారి శెట్టి కృష్ణమూర్తి ఉమారాణి గారు, శ్రీ మహ్మద్ ఇంతియాజ్ జేబున్నీసా బేగం గారు, శ్రీ బుడిగె శ్రీనివాస్ నాగమణి గారు, శ్రీ కుంచం రమణమ్మ సోమయ్య గారు, శ్రీ సుంకరి సైదులు పుష్పమ్మ గారి సహాయంకు ధన్యులము.

పుస్తక ప్రచురణకు సహకరించి, సకాలంలో పుస్తకాన్ని అందించడంలో వెన్నుదన్నుగా ప్రోత్సాహం అందించిన మా మిత్రులు డా. వి.జయప్రకాష్ గారికి మరియు ముఖచిత్రం రుపకర్త మా శిష్యుడు చి. పవన్‌కు ధన్యవాదాలు.

**సంపాదకులు**

**శీలం భద్రయ్య**

పిజిటి తెలుగు

మోడల్ స్కూల్, శాలిగౌరారం.

# ధన్యవాదాలు

**డా. నందిని సిధారెడ్డి**
**తెలంగాణ సాహిత్య అకాదమి అధ్యక్షులు**

**డా. ఏనుగు నరసింహారెడ్డి**
**తెలంగాణ సాహిత్య అకాదమి కార్యదర్శి**

**శ్రీ అలుగుబెల్లి సత్యనారాయణ రెడ్డి**
**సంచాలకులు, తెలుగు అకాదమి, హైదరాబాదు**
**అడిషనల్ డైరెక్టర్, మోడల్ స్కూల్స్, హైదరాబాదు**

**శ్రీ రమణకుమార్**
**డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ లైబ్రరీ(FAC), హైదరాబాదు**

**శ్రీ లింగయ్య**
**జాయింట్ డైరెక్టర్, మోడల్ స్కూల్స్, హైదరాబాదు**

**శ్రీమతి పాలడుగు సరోజినీదేవి**
**జిల్లా విద్యాధికారి, నల్గొండ జిల్లా**

**డా. కాసర్ల రవికాంత్ రావు**
**జిల్లా విద్యాధికారి, సిద్ధిపేట జిల్లా**

**శ్రీ జి.నాగయ్యగారు**
**మండల విద్యాధికారి, శాలిగౌరారం, నల్గొండ జిల్లా**

**శ్రీమతి జి.రాగిణి**
**ప్రిన్సిపాల్, తెలంగాణ మోడల్ స్కూల్, వల్లాల,**
**శాలిగౌరారం, నల్గొండ జిల్లా**

ఆచార్య వెలుదండ నిత్యానందరావు
తెలుగు పాఠ్య ప్రణాళికా సంఘం అధ్యక్షులు, తెలుగు శాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు

ఆచార్య సూర్యా ధనంజయ
తెలుగు శాఖ అధ్యక్షులు,
ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు

డా.కమలాకరశర్మ
సహయాచార్యులు, తెలుగుశాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు

డా.ఎస్.రఘు
తెలుగు శాఖ అధ్యక్షులు,
మహిళా విశ్వవిద్యాలయం, కోఠీ, హైదరాబాదు

డా.పి.వారిజారాణి
సహయాచార్యులు, తెలుగు శాఖ,
ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాదు

డా. ఏలే విజయలక్ష్మి
సహయాచార్యులు, తెలుగు శాఖ,
ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాదు

**డాక్టర్ బెల్లి యాదయ్య**

ప్రధానాచార్యులు, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, రామన్నపేట, నల్గొండ జిల్లా

**డా. తండు కృష్ణ కౌండిన్య**

సహయాచార్యులు, తెలుగుశాఖ, నాగార్జున డిగ్రీ కళాశాల, నల్గొండ

**గండు మహేందర్**

సహయాచార్యులు, తెలుగుశాఖ, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, ములుగు

**డా.జల్దా విశ్వనాద్**

సహయాచార్యులు, తెలుగుశాఖ, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, దేవరకొండ

**డా.లింగనబోయిన లేఖానంద స్వామి**

ప్రిన్సిపాల్, రాఘవేంద్ర బి.ఈ.డి. కళాశాల, నల్గొండ జి ల్లా

**శ్రీ ఎ. రాం ప్రసాద్**

ప్రిన్సిపాల్, టి.ఎస్.మోడల్ స్కూల్, ఆర్.సి.పురం, సంగారెడ్డి జిల్లా

**శ్రీమతి టి.మమత**

ప్రిన్సిపాల్, టి.ఎస్.మోడల్ స్కూల్, కనగల్, నల్గొండ జిల్లా

**శ్రీమతి యల్. రంజిత**

ప్రిన్సిపాల్, టి.ఎస్.మోడల్ స్కూల్, నిడమనూర్, నల్గొండ జిల్లా

**శ్రీమతి బి.నిర్మల**

ప్రిన్సిపాల్, టి.ఎస్. మోడల్ స్కూల్, త్రిపురారం, నల్లగొండ జిల్లా

శ్రీమతి వి.మంజువాణి

ప్రిన్సిపాల్, టి.ఎస్.మోడల్ స్కూల్, వేములపల్లి, నల్లగొండ జిల్లా

శ్రీమతి జి.సుజాత

ప్రిన్సిపాల్, టి.ఎస్.మోడల్ స్కూల్, మిర్యాలగూడ, నల్లగొండ జిల్లా

శ్రీ కరుణాకర్

ప్రిన్సిపాల్ (FAC), టి.ఎస్.మోడల్ స్కూల్, దిండి, నల్లగొండ జిల్లా

శ్రీమతి సబిత

ప్రిన్సిపాల్ (FAC), టి.ఎస్.మోడల్ స్కూల్, కేతేపల్లి, నల్లగొండ జిల్లా

శ్రీ. రాదారి నాగరాజు

ప్రిన్సిపాల్ (FAC), టి.ఎస్.మోడల్ స్కూల్, ఇర్కోడు, సిద్ధిపేట జిల్లా

శ్రీమతి పి.శోభారాణి

తెలుగు ఉపన్యాసకులు, ప్రభుత్వ జూ. కళాశాల, నకిరేకల్, నల్గొండ జిల్లా

డా. పెండ్యాల మహేశ్వర్

తెలుగు ఉపన్యాసకులు, ఆదర్శ పాఠశాల & జూనియర్ కళాశాల,

తుర్కపల్లి, యాదాద్రి జి ల్లా

డా. పగడాల గోపాలక అష్ణ

సహాయాచార్యులు, తెలుగు శాఖ,ట్రిపుల్ ఐటి ప్రాంగణం, బాసర

శ్రీ వెన్నెల సత్యం

తెలుగు ఉపాధ్యాయులు, జి.ఉ.పాఠశాల, తుర్కపల్లి, రంగారెడ్డి జిల్లా

శ్రీ గరిడేపల్లి రాజు

తెలుగు ఉపాధ్యాయులు,

మైనారిటీ గురుకుల పాఠశాల,తుంగతుర్తి, సూర్యాపేట జిల్లా

శ్రీ కె శ్రీను

ఎస్ఏ తెలుగు, జడ్.పి.హెచ్.ఎస్ శాలిగౌరారం

శ్రీ డి నరసయ్య

ఎస్ఏ తెలుగు జడ్.పి.హెచ్.ఎస్ శాలిగౌరారం

శ్రీ బి వెంకటేశం

ఎల్ పి తెలుగు, జడ్.పి.హెచ్.ఎస్ అడ్లూరు

శ్రీ పి శంకర్

ఎల్పి తెలుగు, జడ్.పి.హెచ్.ఎస్ కొండారం

శ్రీ డి శంకరయ్య

ఎల్ పి తెలుగు, జడ్.పి.హెచ్.ఎస్ వూట్కూరు

శ్రీ ఎం వెంకన్న

ఎల్ పి తెలుగు, జడ్.పి.హెచ్.ఎస్ మని మదె

శ్రీ పి శ్రీనివాస్

ఎల్పి తెలుగు, జడ్.పి.హెచ్.ఎస్ భైరవుని బండ

# విషయ సూచిక

55. అమ్మా నాన్న
56. అమ్మమ్మ
57. కుండ
58. దైవం
59. సమాజం
60. రైతు
61. నాన్న
62. కంటిపాప
63. ఐక్యమత్యం
64. కుటుంబం
65. దానం
66. తలరాత
67. వానలు
68. నగరం
69. ఆప్యాయత
70. వెనుక
71. దీపం
72. వెల
73. నేలతల్లి
74. హితుడు
75. అమృతం
76. నీ స్నేహం
77. బరువు
78. మిన్న
79. అమ్మ ప్రేమ
80. ప్రతిరూపం
81. గమ్యం
82. చెరువు
83. మహారాణి
84. నడత
85. బండి
86. మేఘం
87. హలం
88. భోజనం
89. మనసు
90. భారతదేశం
91. నీకెందుకు
92. అధికారం
93. బిచ్చగాళ్ళు
94. త్యాగం
95. కిటికీ
96. రూపం
97. తరువు
98. మాధుర్యం
99. గౌరవం
100. అందం
11. దూరం
102. అనురాగం
103. లోటు
104. ప్రతిసృష్టి
105. కవిత్వం
106. పేగుబంధం
107. పుట్టినరోజు
108. కవిత
109. బాలలం
110. వేపచెట్టు
111. దానగుణం





తెలంగాణ భాషాదినోత్సవం&కాళోజీ జయంతి **2019** సందర్భంగా

పిల్లల కవితాసంకలనం ఆవిష్కరణకు....

# ఆహ్వానం

తేది: 07 సెప్టెంబరు 2019. మధ్యాహ్నం 1:00 – 4:30 వరకు

వేదిక : తెలంగాణ మోడల్ స్కూల్,పల్లాల,శాలిగౌరారం,నల్గొండ.

**విశిష్టఅతిథులు**

శ్రీ డా.ఏనుగు నరసింహారెడ్డి గారు తెలంగాణ రాష్ట్ర సాహిత్య అకాడమి కార్యదర్శి

పద్మశ్రీ శ్రీ చింతకింది మల్లేశంగారు [illegible]

**ప్రత్యేకఅతిథులు**

శ్రీ అలుగువెల్లి సత్యనారాయణ రెడ్డి గారు డైరెక్టర్,తెలుగు అకాడమి,మోడల్ స్కూల్స్

శ్రీ లింగయ్య గారు,జాయింట్ డైరెక్టర్,మోడల్ స్కూల్స్

శ్రీమతి సాలడుగు సరోజినిదేవి గారు,నల్గొండ జిల్లా విద్యాధికారిణి

శ్రీ జి.నాగయ్య గారు,మండల విద్యాధికారి

శ్రీమతి జి.రాగిణి గారు,ప్రిన్సిపాల్ ,తెలంగాణ మోడల్ స్కూల్,పల్లాల

**ప్రధానవక్త**

సహస్రపూర్ణ బుర్రకథ గాన ప్రవీణ శ్రీ. అల్లా జయరాములు గారు

హరికథాభాగవతార్ల సంఘం రాష్ట్ర ప్రధానకార్యదర్శి

**ఆత్మీయ అతిథులు**

శ్రీ డా.పండాల మహేశ్వర్ గారు,తెలుగు ఉపన్యాసకులు,మోడల్ స్కూల్,తుర్కపల్లి,యాదాద్రి జిల్లా

శ్రీ డా.వేదునూరి రవీందర్ రెడ్డి గారు,తెలుగు ఉపన్యాసకులు,మోడల్ స్కూల్,వలిగొండ,యాదాద్రి జిల్లా

శ్రీ డా. బి.జయప్రకాశ్ గారు,తెలుగు ఉపన్యాసకులు,మోడల్ స్కూల్,రేగోడు,సంగారెడ్డి జిల్లా

శ్రీమతి ఎ.సరస్వతి గారు,తెలుగు ఉపన్యాసకులు,మోడల్ స్కూల్,పోచంపల్లి,యాదాద్రి జిల్లా

శ్రీ టి.సతీశ్ కుమార్ గారు,తెలుగుఉపన్యాసకులు,మోడల్ స్కూల్,అమడబాకుల,మహబూబ్ నగర్ జిల్లా

శ్రీ సుంకరి బ్రహ్మంగారు,తెలుగు ఉపాధ్యాయులు,మోడల్ స్కూల్,తిప్పర్తి,నల్గొండ జిల్లా

శ్రీ సకిరేకంటి శీనయ్య గారు,కవి,రచయిత,మోడల్ స్కూల్,బొమ్మలరామారం,యాదాద్రి జిల్లా

శ్రీ నల్లా ప్రవీణ్ రెడ్డి గారు,యువకవి,తెలుగు పరిశోధకులు,ఉస్మానియా యూనివర్సిటీ

**దాతలు**

శ్రీ మహ్మద్ ఇంతియాజ్& జేబున్నీసా బేగం గారు ( గ్రామ సర్పంచ్,పల్లాల )

శ్రీ ముంగారి శెట్టి కృష్ణమూర్తి& ఉమారాణి గారు (వ్యాపారవేత్త)

శ్రీ బుడిగె శ్రీనివాస్& నాగమణి (విద్యావేత్త)

శ్రీకుంచం రమణమ్మ & పోచయ్య గారు (గ్రామ సర్పంచ్,సోమారం )

శ్రీమంగళి సైదులు& పుష్పమ్మ గారు (గ్రామ పెద్దలు,బొప్పారం)

**సహాధ్యక్షులు**

శ్రీ శీలం భద్రయ్యగారు, తెలుగు ఉపన్యాసకులు,మోడల్ స్కూల్, పల్లాల

**సమన్వయకర్తలు**

శ్రీ రేగుల శ్రీనివాస్ గారు, తెలుగు ఉపాధ్యాయులు,మోడల్ స్కూల్,పల్లాల

శ్రీ తండు ఆంజనేయులు గారు,తెలుగు ఉపాధ్యాయులు,మోడల్ స్కూల్,పల్లాల

అందరూ ఆహ్వానితులే ......

**ఆహ్వానించువారు: విద్యార్థిని & విద్యార్థులు,తెలంగాణ మోడల్ స్కూల్,పల్లాల**

# 1. అడుగు

డౌట్ ఉంటే డాడిని అడుగు
అనుమానం ఉంటే అమ్మను అడుగు
ఆచితూచక అడుగిడితే కనబడే
ప్రపంచంలో తడబడే ప్రమాదం ఉందని గుర్తెరుగు
గురివైపు సాగాలంటే గురువును అడుగు
ప్రోగుబడిన ప్రపంచ విషయాల పరిశీలనకొరకు
పుస్తకాన్ని అడుగు
వెనక్కి తిరిగిరాని క్షణం చూసి
తడి ఆరని సంతోషాల కొసరును అడుగు
వెలుగును అడుగు ఎప్పుడూ
తోడుగా ఉండే నీడ జాడ
మసి బారని ఆలోచనల తెరని అడుగు
సమాజహిత ఎడతెగని ఆలోచనలు ఆస్తిగా
ఆసరా తగ్గిన నేస్తాన్ని అడుగు
చాచిన చెలిమి హస్తం అందుకోమని

**పుట్ట శిరీష**
8వ తరగతి, బి సెక్షన్

## 2. వర్షం

రారండోయి రారండోయి
పిల్లల్లారా రారండోయి
సముద్రాలను నింపుకొని
మేఘాల్లో దాచుకొని
మబ్బులనెక్కి వస్తున్నా
చిటపట చినుకుల రూపంలో
మురిపెంగానే వస్తున్నా
పడవలు చేయగా రారండోయ్

**జి.సిరి**
8వ తరగతి

## 3. వీణ

తీయని తేనెల సోన నా తెలంగాణ
వీర చరితల కోన నా తెలంగాణ
నురగలై పారే గోదావరినది నా తెలంగాణ
ఉరకలై ప్రవహించే కృష్ణానది నా తెలంగాణ
రుద్రమ పరాక్రమం పాల్కురికి కవనం
పోతన పాండిత్యం రామదాసు కీర్తనలు
నా తెలంగాణ శతకోటి తరంగాల వీణ

**– జి.సంధ్య**
7వతరగతి, బి సెక్షన్

## 4. నా తెలుగు

తేనె కన్నా తియ్యనిది నా తెలుగు

అమ్మలా ప్రేమను పంచుతుంది నా తెలుగు

స్నేహ హృదయాలను ఒక్కటి చేసేది నా తెలుగు

అన్య భాషల మరిపించేది నా తెలుగు

**సి. హెచ్. నందిత**

బిపిసి మొదటి సంవత్సరం

## 5. శక్తి

ఆకాశంలో ఎగిరే పక్షి శక్తి

రెక్కల్లో దాగి ఉంటుంది

నీటిలో ఈదే చేప బలం

మొప్పల్లో దాగి ఉంటుంది

మనిషి గొప్పదనం

మాట్లాడే మాటల్లో దాగి ఉంటుంది

**– సి. హెచ్. నవ్య**

10వ తరగతి, బి సెక్షన్

## 6. తెలుగు

ప్రశ్నలు రేకెత్తించి
సమాధానాలు రాబట్టి
అభివృద్ధికి మార్గం భాష
గమ్యాలకు దారి తీస్తూ
ఆశల చిగురింపజేయు అస్త్రం భాష
స్వేచ్ఛా యజ్ఞంలో తోలి అడుగు తెలుగు

**వి.చందన**
బి.పి.సి. మొదటి సంవత్సరం

## 7. మహనీయులు

రైతు పట్టేను నాగలి
తీర్చేను ప్రజల ఆకలి
రైతు ఉంటేనే జీవితం
చెరువు ఉంటేనే జలం
సైనికుడు పట్టేను తుపాకి
గురువు పంచెను జ్ఞానం
అమ్మ నాన్న ఇచ్చెను జీవితం

**ఆర్.అంజలి**
10వ తరగతి, బి సెక్షన్

## 8. అన్నం

మోసం తెలియనివాడు

మోసపోవడం అలవాటయినవాడు

మెతుకు పండించే వాడు

కరువు జయించేవాడు

బతుకు చూపించేవాడు

అమృతం కన్నా అన్నం

అమ్మ అంత గొప్పది

**జి .వైష్ణవి,**

9వ తరగతి, బి సెక్షన్

## 9. అమృతం

గుడి లేని దైవం అమ్మ

కల్మషం లేని ప్రేమ అమ్మ

మధురమైన తీపి జ్ఞాపకం అమ్మ

గుండెలోని దైవం అమ్మ

అమ్మ ఉన్న ప్రాంతం స్వర్గం

అమ్మ పంచె ప్రేమ అమృతం

**కె.నవ్య**

10 వతరగతి, ఎ సెక్షన్

## 10. స్ఫూర్తి

మహారాష్ట్రలో పుట్టి
తెలంగాణకు వచ్చి
నిరాడంబర జీవితం గడిపి
ఉద్యమకారునిగా నిలిచి
రజాకార్లను ఎదిరించి
తెలుగు భాష గొప్పదనం తెలిపి
ప్రజలలో చైతన్యం తెచ్చిన
ఓ ప్రజాకవి
మీరే నా స్పూర్తి....మీరే నా ధైర్యం !
ఓ ఉద్యమ కవి
తెలుగు భాషకై నడుస్తాం మీరెక్కడున్నా స్మరిస్తాం !

**వి.శిరీష**

10వ తరగతి, బి సెక్షన్

## 11. ఓ సైనికులారా !

మన దేశం కోసం
మీ నెత్తురు బయటకు పెట్టిరా ఓ సైనికులారా
భారతమాత బాగు కోసం
తల్లిని సైతం వీడి వెళ్ళారా ఓ సైనికులారా
తిరిగిరాని లోకాలకు పయనమయ్యారా
ఓ సైనికులారా !

**బి. అంకిత**

9 తరగతి, ఎ సెక్షన్

## 12. దేవుడి మరో రూపం

అనురాగానికి అర్థం అమ్మ
మమకారానికి మూలం అమ్మ
సుఖదు:ఖాల సుడిగుండాల నడుమ
తీరాన్ని చేర్చు ప్రతి ఇంటి పట్టుకొమ్మ
అలసటకు దూరం అమ్మ
సహనానికి తీరం అమ్మ
నిస్వార్థమైన ప్రేమకు గుర్తుగా
దేవుడు పంపిన రూపం అమ్మ

**జి. శిరీష**
10వ తరగతి, ఎ సెక్షన్

## 13. పట్టణ పక్షులు

అందమైన పచ్చని పొలాలు
కల్మషమెరుగని మొఖాలు
చెరువుల్లో చేపలు చెట్లపై పక్షులు
స్వేచ్ఛకు అద్దం స్వచ్ఛతకు మరో రూపం
వేటగాళ్ళ వలలో పట్టణాలు
మోసగాళ్ళ వలలో పట్టణ పక్షులు
బానిసత్వం మరోరూపం

**వి.శివ**
10వ తరగతి, బి సెక్షన్

## 14. అండ

ప్రయివేటు వేటుపై వేటు వేద్దాం
స్మశాన చదువులకు పాతర వేద్దాం
ప్రగతి ప్రభుత్వాన్ని తీసుకొద్దాం
పసిడి చిరునవ్వులు పూయిద్దాం
ముసలవ్వల మెడలో దండా
ఆసరా పెన్షన్లు అండ

**మేడ పావని**
ఎం.పి.సి. ద్వితీయ సంవత్సరం

## 15. సమానత్వం

ఆడపిల్లకు సమాజం అన్యాయం
చందమామ అందుకున్నా
అందని పురులతో సమానత్వం
కారాదు మహిళ బలిపశువు
భర్త కింద పనిమనిషిగా దాసోహం
అమ్మానాన్న మారాలి
సమాజాన్ని మార్చాలి
సమానత్వం సమాజతత్వం నేర్వాలి

**ఎ.జాయిస్ మేరి**
10వ తరగతి, బి సెక్షన్

## 16.అందం

అందం ఉండి లాభం లేదు
మనసు అందంగా లేనపుడు
అందమైన కళ్ళు ఉండి లాభం లేదు
నికృష్ట చూపులు ఉన్నప్పుడు
పెదవులు అందంగా ఉండి లాభం లేదు
నొప్పించే మాటలు ఉన్నప్పుడు

**బి.యోగేష్**
10వ తరగతి

## 17. నాన్న

నాన్న మనకు అండగా ఉండి
ఆనందాన్ని ఇచ్చేవాడు
చీకటిని దూరం చేసి
వెలుగు నింపేవాడు
బరువు బాధ్యతలను ఇష్టంగా మోసి
కన్నీటిని దాచుకొని నవ్వుతూ
మన భవితకు తోడ్పడేవాడు

**సి. హెచ్. ఆకాంక్ష**
బి.పి.సి. మొదటి సంవత్సరం

## 18. స్నేహం

మంచు కన్నా చల్లనైనది
వెన్నెల కన్నా తెల్లనైనది
త్యాగాల కన్నా గొప్పనైనది
వజ్రం కన్నా విలువైనది
ఆపదనుండి విడదీయనిది

**యు.శ్రావణి**
బి.పి.సి. మొదటి సంవత్సరం

## 19. నా పల్లె

పచ్చ పచ్చని ప్రకృతి నా పల్లె
ఆనందాల హరివిల్లు నా పల్లె
కల్మషం లేనిది నా పల్లె
కనువింపు చేసేది నా పల్లె
జీవ జాతుల సంస్కృతి నా పల్లె
ప్రేమానురాగాల చిరునామా నా పల్లె

**జి .అనుష**
ఎం.పి.సి. రెండవ సంవత్సరం

## 20. బ్రహ్మ

మనం ఏడుస్తున్నప్పుడు
మనకు ఓదార్పు ఇచ్చేది అమ్మ
బుడి బుడి అడుగులు నేర్పేది అమ్మ
జోలపాటలు పాడేది అమ్మ
అమ్మ మన మానవ జన్మకు మరో బ్రహ్మ

**బి.భవాని**
6వతరగతి, ఎ సెక్షన్

## 21. వ్యవసాయం

తొలకరి చిరుజల్లు
రైతు మోముపై విరిసే హరివిల్లు
వెలిగే అందమైన హరివిల్లు
ఏరులు, సెలయేరులు పారెను
మది పైరులు పండెను

**కె.పవిత్ర**
9వ తరగతి

## 22. అమ్మ

అణువణువూ ప్రేమను నింపి
అడగడుగూ ఆశలు పంచి
అక్షరాలు నేర్పే తొలి గురువు
నా పాలిటి సుగుణ కల్పతరువు
అమ్మ లేని లోకం దేవుడు లేని స్వర్గం

**జి.చరిత**
9వ తరగతి

## 23. బడి

పాఠశాల దేవాలయము
జ్ఞానమును పంచు జననాలయము
సంప్రదాయ, సంస్కృతులను
నడవడిని తల్లి తండ్రి లాగా
నడక నేర్పు గురువులు
కలియుగ దైవములు

**రేణుశ్రీ దేవరకొండ**
ఎం.పి.సి. ప్రథమ సంవత్సరం

## 24. ప్రేమ

ప్రేమను
దాచుకోవడం
తెలియని వ్యక్తి అమ్మ
ప్రేమను దాచుకోవడం తెలియని నాన్న
ప్రేమించడం మాత్రమే తెలిసిన వాళ్లకు
ద్వేషించడం తెలియదు మరి

**బి.కీర్తి**
8వ తరగతి, బి సెక్షన్

## 25. గెలుపు

సూర్యుడికి అస్తమించడం తెలుసు
అబద్ధానికి సత్యం తెలుసు
పడినవారికి లేవడం తెలుసు
ఓడినవారికి గెలుపు తెలుసు

**– డి.పావని,**
8వ తరగతి, బి సెక్షన్

## 26. అమృతం

అమ్మ ప్రేమ ధైర్యం
అమ్మ మంచితనం అనురాగము
అమ్మ అనురాగం అమృతం
అమ్మ వంటి దైవం అవనిలో లేదు

**ఆర్.రమ్య**
8వ తరగతి, బి సెక్షన్

## 27. బంధం

అమ్మలేని ప్రాణిలేదు
అమ్మలేని బంధం లేదు
అమ్మలేని కవిత్వం లేదు
సూర్యచంద్రుల మించిన సత్యం అమ్మ

**బి.శ్వేత,**
8వ తరగతి, బి సెక్షన్

## 28. మా ఊరు

మా ఊరు ఒక చెరువు

మా ఊరు ఒక అడవి

మా ఊరు ఒక అందాల భరిణె

మా ఊరు ఒక అనుబంధాల ధరణి

**ఆర్.అనూష**

8వ తరగతి, బి సెక్షన్

## 29. ఉర్వి

అ అంటే అమ్మ అనురాగం

ఆ అంటే అమ్మ ఆప్యాయత

ఇ అంటే ఇలవేల్పు అమ్మే

ఉ అంటే ఓపికకు ఉర్వి అమ్మే

**యం.శ్రుతిక**

8వ తరగతి, బి సెక్షన్

## 30. స్నేహం

మన మరో ప్రపంచం
సువాసనల సుమం
కనువిందు చేసే కళ్ళు
స్వచ్ఛమైన పువ్వు

**బి.హన్సిక**
8వ తరగతి, బి సెక్షన్

## 31. మధురగీతము

మరపురాని ప్రియరాగము స్నేహము
మనసు నింపు మధుర గీతము స్నేహము
మనసులో నాటుకున్న వృక్షము స్నేహము
వీడిపోని బంధము స్నేహము

**యన్.మమత**
బి.పి.సి. ద్వితీయ సంవత్సరం

## 32. నాలోని భావాలు

నాలోని భావాలు బంగారు నాణేలు

నాలోని భావాలు పెద్ద పెద్ద అలలు

నాలోని భావాలు పచ్చని చిలుకలు, వెచ్చని పిలుపులు

నాలోని భావాలు ఆనందాల అలుగులు వెలుగులు

**పి.స్వాతి**

బి.పి.సి. ద్వితీయ సంవత్సరం

## 33. ఎండిన పువ్వు

పల్లెలు ప్రశాంతం

నగరం ప్రమాదం

పల్లెల నవ్వు  మల్లెపువ్వు

నగరం నవ్వు  ఎండిన పువ్వు

**ఎ.ఉదయ్ కృష్ణ**

10వ తరగతి, బి సెక్షన్

## 34. మూసి

మనకోసం వచ్చింది మూసి

ముసి ముసి నవ్వింది అవనిని చూసి

రైతుకు పంటలు పండించింది మూసి

అందరి ఆకలి తీర్చింది మూసి

అందరి దప్పిక తీర్చింది మూసి

**ఎస్.మణికుమార్**

10వ తరగతి, బి సెక్షన్

## 35. ఓర్పు

అలుపు లేని ఓర్పు

అపురూపమైన అనురాగం

అరుదైన మనిషి

మనదైన మనిషి అమ్మ

**వీర్లపాటి గాయత్రి**

8వ తరగతి, బి సెక్షన్

## 36. గురువు

త్రిమూర్తులు ఒక్కటైన రూపం

తల్లిదండ్రుల స్థానం

వ్యక్తిత్వ మాణిక్యము

ప్రేమకు మరో రూపం

**చొల్లేటి దీక్షిత**

8వ తరగతి, బి సెక్షన్

## 37. తమ్ముడు

నా జన్మ అమ్మది

నా పెంపు నాన్నది

నా ఆత్మ స్నేహం

నా ప్రాణం తమ్ముడు

**మేడి మమత**

ఎంపిసి ద్వితీయ సంవత్సరం

## 38. రక్షణ

గుడి రక్షణ దేవుడికి

బడి రక్షణ పిల్లలకు

భక్తులకు పుణ్యం

పిల్లలకు జ్ఞానం

ప్రజలకు దేవుడి రక్షణ

పిల్లలకు గురువుల శిక్షణ

**టి.పూజ**

ఎంపిసి ద్వితీయ సంవత్సరం

## 39. రాలేను

మిత్రమా నా వద్దకు ఎలా వస్తావు

బస్సులో వద్దామంటే భారీ వర్షాలు

రైల్లో వద్దామంటే రద్దీగా ఉన్నాయి

విమానంలో వద్దామంటే వినాశకాలు

అందుకే నేను రాను నువ్వు రాకు

**బి.నవ్య**

ఎం.పి.సి. ద్వితీయ సంవత్సరం

## 40. గోస

మన భాష మన యాస

మన భాష కనువిందు

మన భాష యాస వినసొంపు

మన తరతరాల వలస  గోస

తెలుగు వారి భావి తరాల భవిత

**పి.రిబ్బిక**

ఎం.పి.సి.  ద్వితీయ సంవత్సరం

## 41. దీపం

ఆకాశమే హద్దుగా ఆలోచించు

సమాజమే ఇల్లుగా జీవించు

చదువే ఆయుధంగా శ్రమించు

సంస్కారమే బలంగా తపించు

ధర్మ శరణమే ధరనంగా ధరించు

దేశభక్తి చైతన్యంగా గుండెలో దీపాన్ని వెలిగించు

**ఎస్.వాణి**

ఎం.ఈ.సి.  ద్వితీయ సంవత్సరం

## 42. ఆదర్శ పాఠశాల

ఆదర్శ పాఠశాల అందాల పాఠశాల

అనుబంధాలశాల జ్ఞాపకాలు చాలా

అమ్మ ఒడి మా బడి

మా మంచి గురువుల ఆప్యాయతలు

నిండిన ఆత్మీయ పాఠశాల

**బి.స్వాతి**

10వ తరగతి, ఎ సెక్షన్

## 43. గుణకారం

అమ్మ అనేది రెండక్షరాలు

ప్రేమ అనేది రెండక్షరాలు

అమ్మ ప్రేమ నాలుగక్షరాలుకాదు

గుణింతం చేస్తే

పదహారక్షరాల స్వచ్ఛమైన ప్రేమ

**డి.మేఘన**

ఎం.ఈ.సి. మొదటి సంవత్సరం

## 44. నవ్వులు

నా కలల నవ్వులు
పూయని పువ్వులు
కనిపించని మెరుపులు
భయపడని అడుగులు

**ఎన్. సతీష్**
9వ తరగతి, ఎ సెక్షన్

## 45. ఎర్రలు

వానకు జర్రున జారి
ఎర్రలు మొర్రో అనెను
చేపలు కప్పలు చేరి
గుట గుట మింగెను
గుటకలు వేసెను

**జి .మానస**
9వ తరగతి, ఎ సెక్షన్

## 46. ప్రాణం

ప్రపంచం కంటే అందమైనది అమ్మ

సృష్టికి జీవం అమ్మ

నా ప్రాణం అమ్మ

ప్రకృతి అమ్మ

నా జీవితం అమ్మ

**యం.శ్రీవాణి**

ఎం.పి.సి. ద్వితీయ సంవత్సరం

## 47. బ్రహ్మానందం

నవ్వితే అందం

నవ్విస్తే అందం, ఆనందం

నవ్వుతూ నవ్విస్తే పరమానందం బ్రహ్మానందాం

**టి.జ్యోతి**

బి.పి.సి. ద్వితీయ సంవత్సరం

## 48. కాటు

పొలంలో వేశాను నాటు

పాము వేసింది కాటు

అమ్మ కూడా ఏడ్చింది నాతో బాటు

నాన్న తెరిచారు డాక్టర్ గేటు

**బి.గ్రీష్మ**

ఎం.ఈ.సి. ద్వితీయ సంవత్సరం

## 49. ఆనందబాష్పాలు

అడిగినా ఇవ్వని వరాలు

అమ్మ ఇచ్చెను అనుబంధాల వర్షాలు

తీర్చలేవు ఎప్పటికి అమ్మ మమతల ఋణాలు

నీ వృద్ధి అమ్మకు ఆనందాబాష్పాలు

**ఎస్.నందిని**

10వ తరగతి, ఎ సెక్షన్

## 50. మసక

లక్ష్యం లేని జీవితంలో
చూసే కంటికి వెలుగు దూరమవుతుంది
నడిచే దారులు మసక బారుతుంది
గడిచే ప్రతి క్షణం చివరిదవుతుంది

**షిరిచా**
8 వతరగతి, ఎ సెక్షన్

## 51. ముందుకు సాగు

ముందుకు సాగే మిత్రమా
కలలను ఆశయాలను నిజం చేసుకో మిత్రమా
వీచే గాలిలా పూచే పువ్వులా
రాలే చినుకులా పాల సెలయేరులా
ముందుకు సాగు మిత్రమా

**కె. శ్రావణి**
10వ తరగతి, ఎ సెక్షన్

## 52. చిత్తశుద్ధి

భయమనే వరదకు ఆనకట్ట ధైర్యం
ఆకాంక్షల ఆశయాలు
కొత్త వెలుగుకు చిరునామా
ఉత్సాహ నిర్మాణానికి చిత్తశుద్ధి చిరునామా

**బండారు హర్షిత**
10వ తరగతి, ఎ సెక్షన్

## 53. మార్పు

సంకల్పం విజయానికి మూలం
విలువ జీవితానికి మూలం
జ్ఞానం క్రమశిక్షణకు మూలం
విద్యకు మూలం మార్పు

**ఎన్. అజిత్ చంద్ర**
10వ తరగతి, ఎ సెక్షన్

## 54. టిక్ టాక్

టిక్ టాక్ వలలో యువత
పాడు చేసుకుంటున్నారు భవిత
వాట్సప్‌ల మైకం
చీకటి బతుకుల తూకం

**పి.శ్రీదేవి**
10వ తరగతి, బి సెక్షన్

## 55. అమ్మా నాన్న

అమ్మా నాన్న అంటే ఓ కమ్మని ప్రేమ
బ్రహ్మకు తెలియని సృష్టి అమ్మ
అందని ఎవరెస్ట్ పర్వతం నాన్న
ఆకాశం మించిన ప్రేమ నాన్నా అమ్మా

**కె.వైష్ణవి**
సి.ఈ.సి. మొదటి సంవత్సరం

## 56. అమ్మమ్మ

అక్కడ ఉన్నది ఒక తుమ్మ
విరిగింది దాని కొమ్మ
దానికింద కూర్చుంది మా అమ్మమ్మ
తల పగలనందుకు సంతోషించింది మా అమ్మ

**ఎస్. శ్రుతి**
10వ తరగతి, బి సెక్షన్

## 57. కుండ

కుమ్మరోళ్లకు దిక్కే కుండ
సారె తనకు పెద్ద అండ
అదే లేకుంటే బ్రతుకు బండ
కండ కరిగించి పోస్తాడు కుండ

**ఎస్.కీర్తన**
10వ తరగతి, బి సెక్షన్

## 58. దైవం

నీ ఆశయ సాధనకు అమ్మను ఆరాధించురా
తల్లి హృదయంలో ఆనందం నింపరా
అమ్మంటే దైవం చిన్నా
అమ్మేరా జగతికి దీపం

**పి.శివప్రసాద్**
10వ తరగతి, బి సెక్షన్

## 59. సమాజం

సాయం పర్యాయపదం స్నేహం
బోధకు పర్యాయ పదం గురువు
భవితకు భాగ్యము తల్లిదండ్రులు
మనిషి బ్రతుకు లక్ష్యం సమాజహితం

**ఎస్.అరవింద్**
10వ తరగతి, ఎ సెక్షన్

## 60. రైతు

విత్తనం నేస్తం వర్షం

వర్షం స్నేహితుడు చెట్టు

చెట్ల నేస్తం భూమి

భూమి మిత్రుడు వానపాము

వానపాము మిత్రుడు భూపుత్రుడు రైతు

**బి.మౌనిక**

10వ తరగతి, బి సెక్షన్

## 61. నాన్న

వందనాలు నాన్నకు వంద వందనాలు

అభినందన  మందారాలు

బుడి బుడి అడుగులు నేర్పిన

భుజాలపై మోసిన

నాన్నకు వంద వందనాలు

**వి.ప్రణీత**

6వ తరగతి, ఎ సెక్షన్

## 62. కంటి పాప

నవ మాసాలు మోయకున్నప్పటికీ
నిండు నూరేళ్ళు కంటికి పాప నాన్న
ఏడ్చినపుడు ఓదార్చేది అమ్మ
ఆ ఏడుపు దరికి రానియని వాడు నాన్న

**జి .మానస**
7వ తరగతి, బి సెక్షన్

## 63. ఐక్యమత్యం

దిక్కులు చెదిరాయి
ఒక్కటి కావడం తెలియక
ఒంటిగా ఉంటే బలం
విడిపోతే ఓడిపోతాము

**జి. సధాత్రి**
7వ తరగతి, బి సెక్షన్

## 64. కుటుంబం

ప్రపంచం జయించాలంటే ధైర్యం కావాలి
ధైర్యం కావాలంటే కుటుంబం కావాలి
కుటుంబం కావాలంటే అమ్మా నాన్న ఉండాలి
అమ్మా నాన్న ఆశీస్సులే మనకు కొండంత అండ

**ఎ.అనూష**

ఎం.పి.సి. మొదటి సంంవత్సరం

## 65. దానం

అందమైన స్నేహం కన్నా
సువాసన ఇచ్చే మల్లెల కన్నా
ప్రాణం తీసే ప్రేమ కన్నా
ప్రాణం పోసే దానం మిన్న

**ఎస్.భవాని**

ఎం.పి.సి. మొదటి సంవత్సరం

## 66. తలరాత

సంపదలు ఆకలి తీర్చవు
ప్రవచనాలు ప్రపంచాన్ని మార్చవు
కష్టం ఇష్టంగా చేస్తే అది
ప్రపంచం తలరాత మన రాత మార్చుతుంది

**ఎస్.యామిని**

## 67. వానలు

పెంచుదాం పంచుదాం చెట్లను
నాటుదాం నాటుదాం వనాలుగా
ఆపుదాం ఆపుదాం నరకడం
వానలు రావాలి కోతలు పోవాలి

**కె.శైలజ**
10వ తరగతి, ఎ సెక్షన్

## 68. నగరం

పల్లె అమ్మ ఒడి

నగరం శత్రుబ డి

అమ్మ భారం కాదు

భార్య బానిస కాదు

**ఎన్.గౌతమి**

ఎం.పి.సి. మొదటి సంవత్సరం

## 69. ఆప్యాయత

కష్టాలను దూరం చేసే ఆప్యాయత నాన్న

చీకటిని దూరం చేసే మిత్రుడు గురువు

కష్టాలను ఇష్టాలుగా మార్చేవాడు నేస్తం

కన్నీటిని దాచుకొనేది అమ్మ

## 70. వెనుక

విజయం వెనుక కృషి ఉంది
జ్ఞానం వెనుక గురువు ఉన్నారు
ప్రేమ వెనుక అమ్మ ఉంది
అమ్మ వెనుక నాన్న ఉన్నాడు

**నవ్యశ్రీ**
బి.పి.సి. మొదటి సంవత్సరం

## 71. దీపం

దీపం లేనిది వెలుగు ఉండదు
నాన్న లేనిది జీవితానికి అర్ధం ఉండదు
బాధను బాధ్యతగా మోసేవాడు నాన్న
మనోధైర్యానికి అండగా నిలిచేవాడు నాన్న

**యం.స్రవంతి**
బి.పి.సి. మొదటి సంవత్సరం

## 72. వెల

విడదీయలేని బంధం స్నేహం

వెలకట్ట లేని బంధం స్నేహం

జన్మ జన్మల బంధం

వీడిపోని బంధం స్నేహం

**యం. స్వాతి**

బి.పి.సి. మొదటి సంవత్సరం

## 73. నేలతల్లి

నేల తల్లి సహనం

పుష్పం వాసన అందం

మెరిసే మెరపుల కాలం

ఉరికే వాగు ప్రవాహం

**ఎస్. స్నేహ**

బి.పి.సి. మొదటి సంవత్సరం

## 74. హితుడు

సూర్యుడు ఉదయిస్తాడు
గురువు బోధిస్తాడు
దేవుడు కరుణిస్తాడు
స్నేహితుడు రక్షిస్తాడు

**కె.అనుష**

సి.ఈ..సి. రెండవ సంవత్సరం

## 75. అమృతం

మందారం వంటి తమ్ముడు
అక్క చేతి గోరుముద్దలు
తమ్ముడి మాటలు
వజ్రాల మూటలు

**కె.శైలజ**

10వ తరగతి, ఎ సెక్షన్

## 76. నీ స్నేహం

నీ స్నేహం మంచు కన్నా చల్లనైనది
నీ స్నేహం ఊపిరి పోసే ఆయువు
నీ స్నేహం చీకటి తొలగించే వెలుతురు
నీ స్నేహం మల్లె కన్నా తెల్లనిది

**కె.శైలజ**
10వ తరగతి, ఎ సెక్షన్

## 77. బరువు

ప్రకృతి నవ్వు తరువు పువ్వు
రైతు తనువు అచ్చెరువు
వాన తీరుస్తుంది చెరువు బరువు

**వి.శివప్రసాద్**
10వ తరగతి, బి సెక్షన్

## 78. మిన్న

ఆకాశంలో అందని చందమామ కన్నా
ఎర్రగా మండే సూర్యుని కన్నా
కన్పించని దైవం కన్నా
తల్లిదండ్రులు మిన్న

**బత్తుల మధు**
6వ తరగతి, ఎ సెక్షన్

## 79. అమ్మ ప్రేమ

విధి రాత రాసేది బ్రహ్మ
అనుభూతుల సృష్టి అమ్మ
అమ్మ ప్రేమ అవనికి సొంతం
కన్న ప్రేమ అమ్మకు సొంతం

**పి.సమత**
బి.పి.సి. మెదటి సంవత్సరం

## 80. ప్రతిరూపం

ప్రపంచ ఆకారం అమ్మ

సృష్టికి రూపం అమ్మ

ప్రపంచ ఆకారం అమ్మ

అమ్మకు ప్రతి రూపం అమ్మ

అమ్మకు సాటి అమ్మే

**హైమ**

9వ తరగతి

## 81. గమ్యం

మనలో జీవాన్ని నింపి

అల్లారు ముద్దుగా పెంచి

మనలోని లోపాలను సరిచేస్తూ

మన భవిష్యత్తుకు

పునాదులు వేస్తూ

మనకు గమ్యం చూపేది నాన్న

**యం. పూజిత**

9వ తరగతి

## 82. చెరువు

మా ఉరు ప్రక్కన
ఉన్నాయి చెరువులు
వానలు పడితే పారుతాయి కాలువలు
చెరువులు నిండితే పారుతాయి అలుగులు
అలుగులు పారితే మునుగుతాయి పల్లెలు
అందుకే కట్టాము ఆనకట్టలు

**బి.భార్గవి**
10వ తరగతి, బి సెక్షన్

## 83. మహారాణి

లేని తనము దారికి రానీయని
మహారాణి అమ్మ
అనురాగము ఆకలి అమ్మ
మమకార మాధుర్యం అమ్మ
జన్మ లేని అమ్మ లేదు
అమ్మ లేని జన్మ లేదు

**ఎన్. ఉమ**
9వ తరగతి, బి సెక్షన్

## 84. నడత

స్నేహం అర్థం నాన్న
నడక నడత చిరునామా నాన్న
నిస్వార్థ త్యాగం నాన్న
తప్పును సరిచేసేది నాన్న
ప్రమాదం నుండి మనల్ని తప్పించేవాడు నాన్న

**కె.తేజస్విని**
6వ తరగతి

## 85. బండి

పొలంలోని తెల్లని పువ్వులు
ముట్టుకుంటే గువ్వల నవ్వులు
మా తాత ఎడ్లబండి
బండి మీద దుక్కి పిండి
పోతుండె బండి
ఎక్కండి బ ండి
ఇంట్లో దిగండి

**ఎన్.స్వప్న**
10వ తరగతి, బి సెక్షన్

## 86. బండి

నాన్న ప్రేమ అంతులేనిది
మేఘంలా కమ్ముకుంటుంది
వర్షంలా కురుస్తుంది
కాలువలా పారుతుంది
చెరువు మొత్తం నిండిపోతుంది

**ఎన్. ప్రశాంతి**
10వ తరగతి, బి సెక్షన్

## 87. హలం

దున్నుటకు కావాలి హలం
హలం పట్టుకోవాలంటే కావాలి బలం
రైతు లేని రాజ్యం
భూమిపై భోజనం పూజ్యం

**జె. రోహిత్ కుమార్**
10వ తరగతి, ఎ సెక్షన్

## 88. భోజనం

బడికి వెళ్తాము మనం

ఊరి బయట ఉంది వనం

ఇంటి బయట చేస్తాము స్నానం

రోజు తింటాము అన్నం

కాలికి వేస్తారు చెప్పు

ఇంట్లో చేస్తారు పప్పు

దానిలో వేస్తారు ఉప్పు

భోజనం తిన్నాక తింటాం సోంపు

**డి. అజయ్కుమార్**

9వ తరగతి, ఎ సెక్షన్

## 89. మనసు

నా మనసు కడలి తరంగం

అబ్బురాల గాలులు తాకి

ప్రకృతి తెగువ చూసి

మది సంబరంగా మురిసింది

మనసు ఆకలి మనిషి కాదు

మనసు తెలుసుకుంటుంది

**బి.పవన్ కుమార్**

9వ తరగతి, ఎ సెక్షన్

## 90. భారతదేశం

నవమాసాలు మోసేది అమ్మ
నిత్యం నడిపేది నాన్న
తప్పటడుగులు సరి చేసేది సమాజం
కలసి బ్రతికేది అన్న చెల్లితో
భారతదేశం నా కుటుంబం

**ఆర్. సత్యం**
10వ తరగతి

## 91. నీకెందుకు ?

నా కష్టం నీకెందుకు
నా చదువు నీకెందుకు
నా ఆలోచన నీకెందుకు
నా ప్రవర్తన నీకెందుకు
నా ఆశయం నీకెందుకు
నా అదృష్టం నీకెందుకు
నీకెందుకు నీకెందుకు ఇతరుల గురించి ?

**– ఎ.సుప్రియ**
10వ తరగతి

## 92. అధికారం

శ్రీకారంతో మొదలు పెట్టి
సంస్కారంతో గౌరవించి
మమకారంతో ప్రేమిస్తాను
నమస్కారంతో పలుకరించి
అధికారంతో విర్రవీగను

**సుల్తాన్ దినేష్**
9 వతరగతి

## 93. బిచ్చగాళ్ళు

పుట్టుకతో బిచ్చగాడు ఎవరూ కారు
పుట్టుకతో విద్వాంసుడు ఎవరూ కారు
పుట్టుకతో పేదవారు ఎవరూ కారు
సంకల్పం లేనివారు మాత్రం
పుట్టిన పిదప అవుతారు బిచ్చగాళ్ళు

**షేక్ రహీమ్**
10 వతరగతి

## 94. త్యాగం

భవిష్యత్తు భరోసా నాన్న
ఆరాటం అడ్రస్ నాన్న
తోడూ నీడ నాన్న
త్యాగం మరో పేరు నాన్న

**బి.అక్షయ**
8 వ తరగతి

## 95. కిటికీ

నా రెండు కళ్ళు అమ్మా నాన్న
ప్రపంచం చూడడానికి కిటికీ మా నాన్న
కిటికీ తలుపులు అమ్మ
తాళం నా మనసు

**కె.నవీన్**
6 వతరగతి

## 96. రూపం

అమ్మ అంటే అద్భుతం

అమ్మ బంధం జన్మ జన్మల బంధం

అమ్మకన్న గొప్ప

గుణము లేదు

అమ్మ కన్నా గొప్ప రూపం లేదు

**బి.సుష్మిత**

7వ తరగతి

## 97. తరువు

నేను తరువు

అందరికి అదెరువు

ప్రాణవాయువుకు నెలవు

వర్షానికి హేతువు

పచ్చదనానికి దూతను

**ఎస్. అనుష**

10వ తరగతి

## 98. మాధుర్యం

అందమైన పువ్వుకంటే
మా అమ్మ నవ్వు బాగుంటుంది
పెదాలు తెలిసిన మాధుర్యం
అమ్మ అమృత వాక్యం
మంచు కన్నా చల్లనిది అమ్మ ఒడి

**కె.సుష్మ**
7 వతరగతి

## 99. గౌరవం

వినాలి పెద్దల మాటలు
వింటే ఎదుగుతాము
వారి కన్నా ఎత్తుగా
ఇవ్వాలి గౌరవం పెద్దలకు
ఇస్తే పొందుతాము అమితముగా

**టి.మేఘన**
6వ తరగతి

## 100. అందం

ఇల్లాలు వెలుగు ఇంటికి అందం

గుడిలో వెలుగులు దేవుడికి అందం

బడిలో వెలుగు విద్యార్థికి అందం

పాడిపంటల వెలుగు దేశానికి అందం

దేశానికి వెలుగు సైనికుడికి అందం

**ఎన్.శ్వేత**

9వ తరగతి

## 101. దూరం

కన్నతల్లి దూరమైతే

అమ్మకు అనుబంధానికి దూరం

మమతలకు మనసుకు భారం

పిలుపుల తలపులు ఘోరం

**జె.మాధురి**

7 వతరగతి

## 102. అనురాగం

అనురాగం ఆప్యాయత
ఊపిరి ప్రాణం అర్థం అమ్మ
మన కష్టం అమ్మకు కష్టం
మన ఇష్టం అమ్మకు ఇష్టం
మన ఎదుగుదల అమ్మకు ఇష్టం

**కె.హన్సిక**
7వ తరగతి

## 103. లోటు

అమ్మ గురించి ఎంత చెప్పినా తక్కువే
అమ్మ గురించి ఎంతో చెప్పాలని ఆశే
సృష్టిలో మధురమైన పదం అమ్మ
బ్రహ్మ లేని లోటు అమ్మ తీర్చగలదు
అమ్మ లేని లోటు బ్రహ్మ తీర్చలేదు

**– బి.ప్రసన్న**
7వ తరగతి

## 104. ప్రతిసృష్టి

దేవుడిలా అమ్మ రాతి బొమ్మ కాదు
వెన్నలా కరిగే మనసు నీది
వెన్నెలలా నవ్వే నవ్వు నీది
సృష్టికన్న గొప్ప ప్రతిసృష్టి చేసే విద్య నీది

**బి.శ్రీవాణి**
7వ తరగతి

## 105. కవిత్వం

చెట్టు లేని జీవితం
అమ్మలేని కుటుంబం
కష్టంలేని జీవితం
కవిత్వంలేని చదువులు
అమ్మ లేని ఇల్లు
చేలు లేని వనం

**కె.ఇందు**
7వ తరగతి

## 106. పేగుబంధం

మమతల పేగుబంధం అమ్మ

అనుబంధాల దైవిక బంధం అమ్మ

పురిటి నొప్పులు అమ్మ

పుట్టుకకు కారణం అమ్మ

సంస్కారం అమ్మ

సంబంధం అమ్మ

కష్టం అమ్మ కానీ పెంచేది అమ్మ

**జి. శ్రుతి**

7వ తరగతి

## 107. పుట్టిన రోజు

ప్రపంచ వింతలు ఏడు

ఇంద్ర ధనుస్సు రంగులు ఏడు

వారంలో రోజులు ఏడు

నా పుట్టిన రోజు జూన్ ఏడు

**జె.శ్రీజ**

6వ తరగతి

## 108. కవిత

ఒకమార్పు కోసం కవిత
ఒక మంచి కోసం కవిత
మన ప్రతి అడుగు కవిత
మన భవిత కవిత

**పి.శ్రావణి**
6వ తరగతి

## 109. బాలలం

భారతదేశ బాలలం
బంగారు బాటలు వేయడానికి
నడత మార్చుకుంటాం ప్రతిభతో
ఐక్యమత్యంతో నడుచుకుంటాం

**వి. జాస్మిత్,**
6వ తరగతి

## 110. వేప చెట్టు

వేప చెట్టు చూడు పెద్దగా ఉండు
వేపకాయ చూడు చేదుగా ఉండు
వేప చెట్టు నీడ ఎ.సి. కన్నా
చల్లగా ఉండు
వేప పుల్ల బ్రష్ కంటే మంచిది
వేప చెట్టు నాటు ప్రతి ఇంట

**యం.వినయ్**
6వ తరగతి

## 111. దానగుణం

భూమి నవ్వు నువ్వు విన్నావా
నాది అనే వాని చూసి నవ్వుతుంది
నీలాంటి వాళ్ళను చూసి
ఎన్నిసార్లు నవ్విందో
దానగుణం గొప్ప గుణం

**ఎస్.మహేష్**
6వ తరగతి

# ధన్యవాదాలతో...

## మా ఆత్మీయ మోడల్ స్కూల్ తెలుగు భాషోపధ్యాయ మిత్రులు

రాములు - గునగల్ యాచారం, రంగారెడ్డి జి ల్లా

యం.వెంకటేశ్వర్లు - ఇమాంపేట సూర్యాపేట మం. & జి ల్లా

యం.రామకృష్ణ - కర్విరాల నడిగూడెం, సూర్యాపేట జి ల్లా

ఎస్.మనోహర్ - గుండ్ల మాచనూరు, హత్నుర సంగారెడ్డి జి ల్లా

జి .మహేశ్ -ముజాహిద్ పూర్, కుల్కచెర్ల, వికారాబాద్

విద్యా సాగర్ - గుండాల గుండాల జనగాం జిల్లా

యం.రవీందర్ గౌడ్ - అక్కినేపల్లి, నంగునూర్, సిద్ధిపేట జిల్లా

వై.నారాయణ - మిరుదొడ్డి, సిద్ధిపేట జిల్లా

డి.లిల్లీ ఫ్లోరెన్స్ - లక్కారం, చౌటుప్పల్, యాదాద్రి జిల్లా

పి.యాదయ్య - బొంగులూరు, ఇబ్రహింపట్నం, రంగారెడ్డి జిల్లా

యన్.విజయలక్ష్మి - వెన్నచేడు, గండీడ్, మహబూబ్ నగర్ జిల్లా

సి.హెచ్.పారిజాత - ఆరుట్ల, మంచాల్, రంగారెడ్డి జిల్లా

ఆర్.రమేష్ - పసునురు, నాగారం,సూర్యాపేట జిల్లా

ఎ.రేణుకా దేవి - ఇర్కోడు, సిద్ధిపేట జిల్లా

యం.శ్రావణి - మామిడి పల్లి, ఆర్మూర్, నిజామాబాద్

శ్రీను నాయక్ - నిడమనూర్, నల్గొండ జిల్లా

రుద్రాక్షి శేఖర్ - బొత్తలపాలెం, దామరచర్ల, నల్గొండ జిల్లా

డి.మణిమాల – కొడపాక, సిద్ధిపేట జిల్లా

డి.పద్మ – జక్కపల్లి, నర్సాపూర్, మెదక్ జిల్లా

డి.బాసలింగమ్మ – పోతులబగుడ, అల్లాదుర్గ్, సంగారెడ్డి జిల్లా

వి.అంబేద్కర్ – మునగాల, సూర్యాపేట జిల్లా

యం.రాములు – రాయికోడ్, సంగారెడ్డి జిల్లా

పి.ఏడుకొండలు – గుర్రంపోడు, నల్గొండ జిల్లా

ఎస్.కె సయ్యద్ హుస్సేన్ – దుగ్యాల, పి.ఎ పల్లి, నల్గొండ జిల్లా

బి.కొండయ్య – బంట్వారం, వికారాబాద్ జిల్లా

వేల్పుల కృష్ణవేణి – బొల్లారం, జిన్నారం, సంగారెడ్డి జిల్లా

డి.భవాని – గుర్రంపోడు, నల్గొండ జిల్లా

యం.భిక్య – నేరేడుగోమ్మ, నల్గొండ జిల్లా

యం.రమేష్ – మోర్గి, మానూర్, సంగారెడ్డి జిల్లా

అద్దంకి సునీత – బొమ్మల రామారం, యాదాద్రి జిల్లా

ఎస్.విట్టల్ – తిరుమలాపురం, శంకరం పేట (ఏ), మెదక్ జిల్లా

ఎన్.వి.కవిత – తుంగపహాడ్, మిర్యాలగూడ, నల్గొండజిల్లా

పి.శ్వేత – వెలిమెల, ఆర్.సి.పురం, సంగారెడ్డి జిల్లా

వి.లక్ష్మయ్య – కోడెర్, నాగర్ కర్నూల్ జిల్లా

దారా రమణ – ముత్రాజ్ పల్లి, గజ్వేల్, సిద్దిపేట జిల్లా

లోడి.విజయ – కంపసాగర్, త్రిపురారం, నల్గొండ జిల్లా

ఎస్.కె.హజరత్ భీ – కేతేపల్లి, నల్గొండ జిల్లా

ఎస్.సాయిలు –తిరుమలాపూర్, శంకరంపేట (ఎ) మెదక్ జిల్లా

పి.ప్రభాకర్ రెడ్డి – శంకరంపేట (ఆర్) మెదక్ జిల్లా

బి.రమేష్ – అనాజిపురం, పెన్ పహాడ్, సూర్యాపేట జిల్లా

ఇ.స్వరూప్ రెడ్డి – కనగల్, నల్గొండ జిల్లా

హెచ్.వేమారెడ్డి – పెబ్బేరు, వనపర్తి జిల్లా

సింగం.వెంకన్న – మర్పల్లి, వికారాబాద్ జిల్లా

యన్.చిన్నికృష్ణమూర్తి –బొల్లారం, జిన్నారం, సంగారెడ్డి జిల్లా

ఆర్.లక్ష్మీనారాయణ – మునగాల, సూర్యాపేట జిల్లా

ఎస్.వెంకటాచారిటి –గడ్డిపల్లీ, గరిడేపల్లి, సూర్యాపేట జిల్లా

ముత్యాలు – అచ్చంపేట్, నిజాంసాగర్, కామారెడ్డి జిల్లా

కె.మల్లేష్ – కోడెర్, నాగర్ కర్నూల్ జిల్లా

యం.సురేష్ – నవాబ్ పేట, వికారాబాద్ జిల్లా

పి.దామోదర్ – లోతుకుంట, వలిగొండ, యాదాద్రి జిల్లా

బి.మల్లయ్య – కేతేపల్లి, నల్గొండ జిల్లా

సి.హెచ్.మల్లేష్ – పెంచికల పహాడ్, దేవరకొండ, నల్గొండ జిల్లా

యన్.లింగరాజు – కర్విరాల, నడిగూడెం, సూర్యాపేట జిల్లా

యం.రాములు – మర్రిగూడెం, నల్గొండ జిల్లా

జి.కృష్ణమూర్తి – ధన్వాడ, మహబూబ్ నగర్

జి.అశోక్ గౌడ్ – ముజాహిద్ పుర, కుల్కచెర్ల, వికారాబాద్ జిల్లా

జె.రజిత – అక్సాన్ పల్లి, ఆందోల్, సంగారెడ్డి జిల్లా

జి .పరమేశ్వరాచారి – ఇబ్రహీంనగర్, చిన్నకోడూరు, సిద్ధిపేట జిల్లా

యం.నరేష్ – రామాయంపేట, మెదక్ జిల్లా

యన్.గణేష్ – పస్నూర్, నాగారం, సూర్యాపేట జిల్లా

విజయలక్ష్మి – నవీబ్ పేట, నిజామాబాద్ జిల్లా

యం.రామచందర్ – చింతపల్లి, నల్గొండ

పారిజాత – నేదునూర్, కందుకూరు, రంగారెడ్డి జిల్లా

కె.ఉషారాణి – ఆరుట్ల, మంచాల, రంగారెడ్డి

ఎ.జానకి రాములు – బోత్తలపాలెం, దామరవర, నల్గొండ జిల్లా

యం. ఉపేందర్ – పెద్దాపురం, నాంపల్లి, నల్గొండ జిల్లా

డి.ఉదయశ్రీ –కోస్గి, మహబూబ్ నగర్

డి.మహేష్ కుమార్ – జక్కపల్లీ, నర్సాపూర్, మెదక్ జిల్లా

యాదయ్య – నిడమనుర్, నల్గొండ జిల్లా

జి.రమేష్ – బంట్వారం, వికారాబాద్ జిల్లా

బి.అనంతరాములు – అనంతారం, తిరుమలగిరి, సూర్యాపేట జిల్లా

జి .శ్రీలేఖ – ఝూరాసంగం, సంగారెడ్డి జిల్లా

చందా పారిజాత –బొమ్మల రామారం, యాదాద్రి జిల్లా

బి.మంజుల – పోచంపల్లి, యాదాద్రి జిల్లా

పి.స్వరూప – గోపాలపేట,నాగిరెడ్డిపేట, కామారెడ్డి జిల్లా

డి.మహేశ్వర్ – మీనుర్, మద్నూర్, కామారెడ్డి జిల్లా

వి.సుగుణా రెడ్డి – ధన్వాడ, మహబూబ్ నగర్ జిల్లా

జి.దీపిక – నేదునూర్, కందుకూర్, రంగారెడ్డి జిల్లా

ఎస్.లక్ష్మన్న – సంస్థాన్ నారాయణ పురం, యదాద్రి జిల్లా

ఎస్. రమేష్ – అంబం, నిజామాబాద్

కె. సోమసుందర్ –అనంతారం, తిరుమలగిరి, సూర్యాపేట జిల్లా

వి.గురువయ్య – ఆత్మకూర్, సూర్యాపేట జిల్లా

వి.పుష్పలత – వెలిమెల,ఆర్.సి.పురం, సంగారెడ్డి జిల్లా

సి.హెచ్.వాణిశ్రీ – మట్టంపల్లి, సూర్యాపేట జిల్లా

ఎస్.కె.జాకీర్ హుస్సేన్ – మట్టంపల్లి, సూర్యాపేట జిల్లా

కె.పుష్పలత – కంపసాగర్, త్రిపురారం, నల్గొండ జిల్లా

అరుణజ్యోతి – జగదేవ్ పూర్, సిద్దిపేట జిల్లా

డి.సైదులు – నేరేడుగోమ్మ, నల్గొండ జిల్లా

కె.శ్రీను – మర్రిగూడెం, నల్గొండ జిల్లా

టి.ఇందిర – యం.తురకపల్లి, యాదాద్రి జిల్లా

కె.శివకృష్ణ – అంబం, వర్ని, నిజామాబాద్

ఎ.కోటేష్ – వేములపల్లి, నల్గొండ జిల్లా

ఎ మల్లేశం – ఇబ్రహీంనగర్, చిన్నకోడూరు, సిద్ధిపేట జిల్లా

ఆర్.పుష్పలత – గునగల్, యాచారం, రంగారెడ్డి జిల్లా

యం.రజిని – బస్వాపురం,పులకల్, సంగారెడ్డి జిల్లా

బి కృష్ణ – నారాయణపూర్, యాదాద్రి జిల్లా

బి.దామ్లా – రెంజల్, నిజామాబాద్ జిల్లా

ఎస్.కె.చాంద్ - లచ్చాపేట్, దుబ్బాక, సిద్ధిపేట జిల్లా

ఎం.డి.గౌస్ మొహియుద్దీన్ - చేగుంట, మెదక్ జిల్లా

ఓ.రాఘవేంద్రశర్మ - ఆమడబాకుల, కొత్తకోట,వనపర్తి జిల్లా

జి .వసంత - కనగల్, నల్గొండ జిల్లా

ఎం.డి అబ్దుల్ రబ్బాని - దర్పల్లి, నిజామాబాదు జిల్లా

ఎం.డి.రజియుద్దిన్ - పెద్దాపురం, నాంపల్లి, నల్గొండ జిల్లా

ఎస్.కె ఇస్మాయిల్ - తుంగ పహాడ్, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా

ఎస్.కె అల్తాఫ్ హుస్సేన్ - దౌలతాబాద్, సిద్ధిపేట జిల్లా

పి.విజయ సుశీల - పెబ్బేరు, వనపర్తి జిల్లా

టి.భారతి - తిప్పర్తి, నల్గొండ జిల్లా

పి.మహేష్ - పూడూరు, వికారాబాద్ జిల్లా

డి.జ్యోతి - గుండ్లపల్లి, దిండి, నల్గొండ జిల్లా

అనురాధ- మర్పల్లి, వికారాబాద్ జిల్లా

కె.సౌజన్య - దుగ్యాల, పి.ఎ.పల్లి, నల్గొండ

## అందాలు :

ఎన్నో అందాలున్నాయి ఈ జగతిలో
లక్ష్మమ్మ నవ్వు కన్నా అందము లేదు
ఎన్నో సంపదలున్నాయి అవనిలో
అమ్మ ముందు సాటి రావు
ఎన్నో సౌకర్యాలున్నాయి భువిలో
అమ్మఒడిలోని హాయిని మించవు
ఎంతో విశాలం ఈ పుడమి
ఇరుకైన మనసు గల మనుషులు గుర్తించలేరు
ఎన్నో జగడాలు ఈ జగములో
విలువ తెలిసినవారికవి వృధా క్షణాలు...



- శ్రీనివాస్ గోగుల
తెలుగు భాషోపాధ్యాయులు
తెలంగాణ మోడల్ స్కూల్
వల్లాల,శాలిగౌరారం,నల్గొండ జిల్లా

## జ్ఞానం :

జ్ఞానం చీకటిని చెరిపేస్తేనే కదా
ధైర్యం అపజయాల ముళ్ళను
తెగువతో కట్టిపడేస్తుంది
జ్ఞానం విజ్ఞానం అయి వికసిస్తేనే కదా
వెలుగులు విరజిమ్మి దారులు పరిచేది
సుజ్ఞానం వెలిగితేనే కదా అజ్ఞానం తొలగి
శాస్త్ర పరిమళాలు వెదజల్లేది
శాస్త్ర పరిమళం గుభాళిస్తేనే కదా
మానవ సంక్షేమం వెల్లువిరిసేది...



- తండు ఆంజనేయులు,
తెలుగు ఉపాధ్యాయులు
తెలంగాణ మోడల్ స్కూల్
వల్లాల,శాలిగౌరారం,నల్గొండ జిల్లా



తెలంగాణా భాషా దినోత్సవం మరియు
కాళోజీ జయంతి సందర్భంగా

# అంకురం

పిల్లల కవితాసంకలనం...

## ఉక్కు మనిషి :

విలీనం నుంచి విభజన దాకా
వలసవాదం నుంచి బలిదానాల దాకా
అణిచివేత వెతలపై వామనుడి
నాలుగో పాదమే కాళోజీ కైతలగానం

అన్యాయం అంతానికి పంతంపట్టిన
ప్రజాస్వామ్య పావురం
కలియుగ ప్రజల ఆయుధం
ధిక్కారం అతని స్వరం
ప్రజాహితం అతని కలం
కలకాలం నిలిచే కవిత్వం
నిర్మూలించే బానిసత్వం

అతడు ఒలికించినవి
సిరా చుక్కలు కావు
అమృతపు రసగుళికలు
పలికించినవి రసగీతాలు కావు
నోరులేని అభాగ్యుల హృదయ వేదనలు
అన్యాయాన్ని ఎదిరించే
ఆధునిక అక్షరాన్వేషి

అనలం నింపుకున్న
కలం వదిలిన మాటల తూటాలు
త్యాగం నెత్తుటి గాయాల మరకలతో
జీవంపోసుకున్న శాశ్వత శిలాక్షరాలు

దిక్కులు పిక్కటిల్లేలా
జనజాగృతి గీతం
ఆతృతగా ఆలపించిన
ప్రజాకవి కాళోజీ
అతని కవితలు
సెలయేటి రాగాలు
గర్జించే మేఘాలు

అన్యాయాన్ని ఎదిరించి
దళారుల దమననీతిపై
దావానలం కురిపించిన
చిచ్చర పిడుగు
ఉక్కుమనిషి కాళోజీ
ప్రాంతీయుల దోపిడీని
పాతరేసే పాఠాలను బోధించే
భాష యాస అందాన్ని
బడిపలుకుల భాష వదిలి
పలుకుబడుల బాటన
నడిచిన భాషోద్యమ మార్గదర్శి

-శీలం భద్రయ్య
కవి,విమర్శకులు



-శీలం భద్రయ్య
పిజిటి తెలుగు
తెలంగాణ మోడల్ స్కూల్
వల్లాల,శాలిగౌరారం,నల్గొండ జిల్లా.